

లలితా మూవీస్ వారి

# చల్లని తల్లి

నిర్మాత
జి. జగదీశ్ చంద్రప్రసాద్ B.A

దర్శకత్వం:
కె. ఎస్. రామిరెడ్డి B.Sc., D.C.,



డిస్ట్రిబ్యూటర్స్:
పూర్ణా పిక్చర్స్

పూర్ణా ఫిలింస్ రిలీజ్

అనుకోని రాగాలు వినిపించెనే! కనరాని స్వర్గాలు దిగి వచ్చెనే!....

సురేష్ ఇంటర్నేషనల్

# అమ్మాయిల శపథం

నిర్మాతలు: డి. వెంకటేశ్వర్లు, బి. శకుంతలమ్మ

దర్శకత్వం: జి.వి.ఆర్. శేషగిరిరావు



NVKR

ఆంధ్ర-సీడెడ్: నవయుగ   నైజాం: విజయా సురేష్ పిక్చర్స్

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

**శ్రీ రాధాకృష్ణకు స్వాగతం**

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ మే 10వ తేదీ సాయంకాలం 'ఆంధ్రపత్రిక' సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణకు కళాభవన్‌లో స్వాగతమిచ్చి తన సమయజ్ఞతను ప్రకటించింది. ఈ స్వాగత సమావేశానికి నగరంలోని ప్రముఖ రచయితలు, విద్వాంసులు వచ్చారు. అకాడెమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు శ్రీ రాధాకృష్ణకు రచయితలను పరిచయం చేశారు. డాక్టర్ దివాకర్ల వేంకటావధాని అకాడమీ కార్యకలాపాలను వివరించారు. శ్రీ రాధాకృష్ణ తమ సహజ ప్రశ్రయభావంతో కృతజ్ఞతలు తెలుపుతూ ఆంధ్రపత్రిక తమ మాతామహుల ఆశయానుగుణంగా ఆంధ్ర ప్రజలకు సేవ చేయడానికే హైదరాబాదుకు తరలించబడిందని, ప్రజల బాగోగులే పత్రిక లక్ష్యమని అంటూ, పత్రిక నడపడంలోనూ, రచయితలను ఆదరించడంలోను గల సాధక బాధకాలను వివరించారు.

**సమైక్య విస్తరణకు రంజని అపూర్వ సేవ**

ఎ జి ఆఫీసు తెలుగు సాహితీ సమితి మే నెల మొదటివారంలో జరుపుకొన్న 14వ వార్షికోత్సవం విశేషం ఆంధ్రప్రదేశ్ ఉద్యోగులలో సమైక్య భావ విస్తరణకు అపూర్వమైన సేవ చేయడమని నా విశ్వాసం. ఎ జి ఆఫీసు కేంద్రప్రభుత్వం సంస్థ గనుక 22 రాష్ట్రాలవారూ ఉంటారు. వారికి— తెలుగు మాతృభాష కానివారికి— తెలుగు నేర్పడానికి పూనుకుని స్వల్పకాలిక శిక్షణ యిచ్చి వారిని మాట్లాడేట్టు చేయడమే కాకుండా వారితో 'నీళ్ళు' అనే నాటికను వేయించడం, దానిని వారు చక్కగా ప్రయోగించడం, శ్రోతలను రంజింపచేయడం — చాల ప్రశంసనీయం. 2, 3, 4 తేదీలలో జరిగిన ఈ వార్షికోత్సవాన్ని అకవుంటెంట్ జనరల్ శ్రీ జి రామచంద్రన్ ప్రారంభించారు. మొదటినాడు శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షతన విమర్శపై జరిగిన సదస్సులో శ్రీయుతులు తిరుమల రామచంద్ర, రాంభట్ల కృష్ణమూర్తి, డి ఆంజనేయులు, డాక్టర్ ముకురాల రామారెడ్డి పాల్గొన్నారు. రెండవనాడు తెలుగు సాహిత్యానికి మహిళ సేవ అన్న విషయంపై జరిగిన సదస్సుకు అధ్యక్షత వహించారు శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి. సదస్సులో పాల్గొన్న శ్రీమతులు నాయని కృష్ణకుమారి, సి ఆనందారామం, పరిమళా సోమేశ్వర్, చావలి మణిశాస్త్రి క్రమంగా ప్రబంధకాలపు స్త్రీలు, కథారచయిత్రులు, కథానికలలో స్త్రీలు, తెలుగు మహిళల రచనలలో ఆర్థిక సమస్యలు— గురించి ప్రసంగించారు. మూడవనాడు 'నీళ్ళు' నాటికలో పాల్గొన్నవారికి, ఆ నాటికకు దర్శకత్వం వహించిన డిప్యూటీ అకవుంటెంట్ జనరల్ శ్రీ డి శేషాద్రి సన్మానింపబడ్డారు. శ్రీ పావిలాల గోపాలకృష్ణయ్య అధికారభాష గురించి, డాక్టర్ దివాకర్ల వేంకటావధాని యక్షగానాలు, నాట్యశాస్త్రం గురించి ప్రసంగించారు. డిప్యూటీ అకవుంటెంట్ జనరల్ శ్రీ ఎస్ నాగరాజన్ రంజని ప్రత్యేక సంచిక ఆవిష్కరించారు. కుమారి స్వర్ణలత కూచిపూడి నాట్య ప్రదర్శన చేశారు. నేపథ్యంలో పాడిన శ్రీమతి రాయప్రోలు జానకీదేవి తమ కోకిల కంఠంతో శ్రోతలను తన్మయులను చేశారు. ఆమె గాత్రం వంటి శ్రావ్యమయిన గాత్రం అరుదుగా వినబడుతుందని శ్రోతలు పలువురు ప్రశంసించారు.

**ఆర్యసమాజ్ ప్రణాళిక**

మే 5వ తేదీ నుంచి నగరంలో శతవార్షికోత్సవాలు జరుపుకొన్న ఆర్యసమాజ్ అంతర్జాతీయ ప్రధాన కార్యదర్శి శ్రీ ఓంప్రకాశ్ త్యాగి (పార్లమెంటు సభ్యుడు) పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ, నూరేళ్ళు నిండి, రెండవ శతాబ్దంలో ప్రవేశించిన ఆర్యసమాజ్ సంఘంలోని వరకట్నాలు, వర్ణ విభేదాలు, అస్పృశ్యత వంటి దురాచారాలను నిర్మూలించడానికి పంచాంశ కార్యక్రమం ప్రారంభిస్తున్నదనడం ఎంతో హర్షాన్ని కలిగిస్తున్నది. ఆర్యసమాజ్ కేవలం వేద ప్రామాణ్యం అంగీకరించి, భారతీయ సంఘంలో చేసిన సంస్కరణలు అపూర్వమైనవి. అది చేసిన సేవను ఎవరూ కాదనరానిది, ''కృణ్వంతో విశ్వమార్యం' అన్న సమాజ లక్ష్యం సిద్ధించడానికి సంఘంలోని దురాచారాలన్నీ నిర్మూలితం కావాలి.

**వైస్ ఛాన్సలర్ సలహా**

ఉస్మానియా విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ శ్రీ జగన్మోహన్‌రెడ్డి మే 10వ తేదీన ఒక సమావేశంలో ప్రసంగిస్తూ, విద్యార్థులు, ఉపాధ్యాయులూ, విద్యార్థులు, వ్యష్టిగాను సమష్టిగాను పరోక్షంలో అవినీతిని నిర్మూలించడానికి సహకరించాలని కోరి విశ్వవిద్యాలయం చరిత్రలోనే నూతనాధ్యాయం సృష్టించారు. ఇదివరకు సన్నిహితంగా ఇంతగా కోరిన వైస్ ఛాన్సలర్ ఇంతవరకు లేరు. విశ్వవిద్యాలయంలో అవినీతిని తొలగించడానికి శపథం చేశానని ఆయన అనడమూ బాగుంది. ఇన్నేళ్ళుగా ''పిల్లికి ఎవరు గంట కడుతారు'' అని జంకుతున్న పరిస్థితిలో, ఈ అక్రమ పద్ధతి అంతం చేయాలని పూనిన శ్రీ రెడ్డిని అభినందించాలి. ఆయన ఈ విషయంలో విజయం పొందారా, మార్గదర్శకులుగా వుంటారు. పరాజయం పొందారా, అవమానమనేదేమీ లేదు. మంచికోసం ప్రయత్నించే వారికి పరాజయమూ విజయంతో సమానమే.

**ఉపశ్రుతి**

''ఏమిటి సార్, విమర్శ దూషణ తెలుగువారికొక పరిశ్రమ అయిందని ముఖ్యమంత్రి అన్నారే మొన్న ప్రపంచ సభల సమాప్త్యుత్సవం నాడు!'' అన్నాను ఒక నాయకునితో. ''ఆయన మరొక సంగతి మరచారు నాయకుల్ని ఎన్నుకోడం, వెంటనే వెనక గోతులు త్రవ్వడమూ తెలుగువారి మరొక పరిశ్రమ'' అన్నారు ఆయన.

## ఉత్తరాలు

**కథలు**

వేసవిలో మంచులాంటి ''ప్రేమించి చూడు'' రచయితలయిన శ్రీ ఎం పి ఆర్ రాధాకృష్ణ గారికి నా ధన్యవాదములు. ముఖచిత్రం ముద్రించడంలో మీరు తీసుకుంటున్న శ్రద్ధ శ్లాఘనీయం. ''ఈ సంఘంలో కుటుంబమే ఇది'' సీరియల్ చాలా ఉత్సాహం రేకెత్తిస్తోంది.

యం జి స్వామి, పార్వతీపురం

*

16—5—75 హిందీ నటుడు అమితాబచన్‌తో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఆకర్షణీయంగా ఉన్నది. అంతరిక్షంలో 'ఆర్యభట్' వంటి వైజ్ఞానిక వ్యాసాలు కూడ వేస్తున్నందుకు చాలా సంతోషం. కథల్లో 'మరో ప్రేమ కథ' బాగుంది. ఈ వారంలోనే ప్రారంభం అయిన ''ఈ సంఘంలో కుటుంబమే ఇది'' మొదట్లోనే మమ్ముల ఆకట్టుకుంది. ''శమంత—హేమంత'' సీరియల్ రసవత్తరంగా సాగుతోంది.

మండలపు రోశయ్య, గడ్డం ప్రభాకరరావు, బండ్లవారిపాలెం

**సీరియల్**

'ఈ సంఘంలో కుటుంబమే ఇది' సీరియల్ సరిక్రొత్త తరహాతో వుండి ఆదిలోనే ఆనందపరచింది.

పాలడుగు దైవాధీనం ధర్మావతీధీనం భువనగిరి

* * *

అట్టమీద బొమ్మగా 'నటిలత' యొక్క వర్ణచిత్రం ముచ్చటగా ఉంది. అన్నపూర్ణగారు వ్రాసిన 'ఈ సంఘంలో కుటుంబమే ఇది!' రచన వాస్తవానికి చాలా సన్నిహితంగా ఉంది. పిల్లల భవిష్యత్తుకై తల్లిదండ్రులు శ్రద్ధ వహించకపోతే వారు దారం తెగిన గాలిపటాలుగా పెను గాలుల్లో చిక్కుకుని అనేక బాధలకు గురవుతారు. అన్నపూర్ణగారు సీరియలును ఎలా నడిపిస్తారో

(46వ పేజీ చూడండి)




*[గత సంచిక తరువాయి]*

"ఏమండీ! ఈవేళ ఆఫీసుకు శెలవు కదా! ఒక చోటుకి వెళ్ళాలి వస్తారా?" అని అడిగింది అరవింద

"చిత్తం! దేవీ దాసులం"

"పరిహాసం కాదు తప్పకుండా రావాలి"

"నీమాట ఎప్పుడు కాదన్నాను అరూ!"

"ఆమాట కాదంటారేమోనని భయం!"

"ఏం అంత వెళ్ళననిపించే చోటా అది!"

"అహా! మీరు అనుమానించే చోటు అదీ నా భయం"

"ఈ డొంకతిరుగుడు అంతా మాని — అసలు విషయం చెప్పు" అంటూ ఆమె బుగ్గలు పుణికి పుచ్చుకున్నాడు ప్రభాకర్.

"ఉండండి చెపుతాను మధ్యలో అడ్డు రాకుండా వినండి ఏం?"

"చిత్తం!"

"కష్టంలో ఉన్నప్పుడు దాన్ని గడిపి గట్టెక్కించమని దేవుడికి మనం మొక్కుకుంటాము ఆ కష్టం గడిచినప్పుడు ఆ దేవుడి మొక్కు తీర్చటం మన ధర్మం కాదంటారా?"

"ఓహో! అదా సంగతి మొగుడికి ఉద్యోగం ఇప్పించమని వెంకటేశ్వరుడికో .. వేణుగోపాలునికో మొక్కుకున్నానని చెప్పక ఈ ఉపోద్ఘాతం అంతా ఎందుకు? గుడికి వెడదామంటే రానంటానని భయమా?"

"కాదు అంతకంటె పవిత్రమైన చోటుకి వెళ్ళాలి దేవుని మించిన దేవతను దర్శనం చేసుకోవాలి!"

"అబ్బ రచయితగారి అర్ధాంగి ననిపించుకున్నావు కాని ఈ సస్పెన్సు కట్టిపెట్టి అసలు విషయం సూటిగా చెప్పవే చినదానా!"

"దేవుడయినా పిలవకుండా పలకడు కాని, ఈ దేవత కోరకుండానే వరమిచ్చింది అందుకనే, మనం తప్పకుండా వెళ్ళాలి"

"ఏమిటేసోది ఇంతకీ ఆ దేవత మనిషా— ఊాయా?"

అరవింద వెన్నెల కురిసేలా నవ్వింది. "గతంలో ఎలాంటి దయితే నేం — ఇప్పుడు వెన్నకన్న మెత్తని మనసుకల మనిషి"

"అమ్మాయ్! అసలు సంగతి సూటిగా చెప్పొద్దని తానే చెప్పిందా?"

"కొన్ని విషయాలు ఒక్క ముక్కలో చెప్పగలిగుండీ పది పేజీలు పెంచుతారు— మీ రెందుకని?" అని అరవింద సవాలు చేసింది

"అదే కథలో టెంపో అంటే!"

"మీ అడుగు జాడల్లో నడిచే నేనూ అదే చేస్తున్నాను లెండి"

"ఇంక కబుర్లు కట్టిపెట్టి గుడికి ఏం తీసుకువెళ్ళాలో చూడు"

"మనం మంచి మనసుతో వెడితే చాలు— కానుకలామెకు తీసుకుపోనక్కర్లేదు"

"ఇంతకీ ఆ మహాతల్లి ఎవరు బాబూ! అరగంటనుంచి పురాణంతో చంపేస్తున్నావు"

"మీ కుద్యోగం ఇప్పించిన మనిషి!"

"నా కెవరో ఇప్పించలేదు ఇంటర్వ్యూలో సెలక్టయ్యాను నాకు వచ్చింది అంతే!"

"ఇచ్ఛిత్తంగా మీరు వస్తాయనుకున్న ఉద్యోగాలెన్నో రాలేదు ఈసారి ఇంటర్వ్యూ పాడు చేశానని మీరు బాధపడినా ఇది వచ్చింది ఈ నిజాన్ని మీరప్పుడే మర్చిపోయారా?"

"ఇంతకీ నువ్వనేదేమిటి? ఆవిడెవరో దయతలచి నాకుద్యోగం ఇప్పించిందంటావ్ నా ముక్కు మొహం తెలియని దానికి నామీద అంత జాలెందుకుట? అదీకాక నీకు మాత్రం ఆవిడెలా తెలుసు?" అంటూ అరవిందని పరీక్షగా చూశాడు ప్రభాకర్

"క్లిష్టపరిస్థితుల్లో ఉన్న మన కుటుంబాన్ని సమయానికి విధంగా కాపాడిందామె సదుద్దేశ్యం లేనిదయితే మనకింత సాయం చేస్తుందా?"

"ఉద్దేశ్యం మంచిదా — చెడ్డదా అన్నది చేసిన మనిషి తత్వంమీద ఆధారపడి ఉంటుంది. ఇంతకీ ఎవరో చెప్పు — మనకీ ఆనందం మూడు కాలాలపాటుంటుందో — లేక మూణ్ణాళ్ల ముచ్చటో చెప్పేస్తాను"

"ప్రతి మనిషిలోను కొద్దో గొప్పో మంచితనం అంటూ మిగిలి ఉండకపోతే ఈలోకం అంతా ఎప్పుడో శ్మశాన వాటికక్రింద మారిపోయేదని—మీరొక సారనలేదూ!"

ఒక్కక్షణం అరవిందవైపు సాలోచనగా చూశాడు ప్రభాకర్ అతని ముఖంలో మారే రంగుల్ని పరికిస్తూ క్షణాలు లెక్కపెట్టింది ఆమె చటుక్కున అరవింద భుజాలు పట్టుకుంటూ, "కాళింది! కాళింది! అవునా! అవునా?." అని పళ్ళు పటపట కొరికాడు అతను

అరవింద తలదించుకుంది

"నాకు ముందే ఎందుకు చెప్పలేదు?" అరిచాడతను

"ఏమని చెప్పమంటారు? మంచి మనస్సుతో మనకు సహాయం చేస్తానన్న మనిషి మీద కక్షకట్టమని ప్రోత్సహించమంటారా? కోరని వరం ప్రసాదిస్తానంటే కాలదన్నుకోమంటారా? అప్పుడే నేను మీకు చెప్పానంటే



# ఈ వేసవిలో మీ పిల్లలకు ఎక్కడ చెమట పేలుడు సంభవిస్తుంది ?




ఎక్కడ పేలినప్పటికీ, జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరుతో అరికట్టండి ఒక్క జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే 3 రకాలుగా పనిచేయు ఋజువైన ఔషధీయుక్త ఫార్ములా కలిగియున్నది

- చెమటను పీల్చుకొని, చర్మముల రంధ్రములను మూసివేయుటను అరికడుతుంది
- క్రిముల పెరుగుదలను నిరోధిస్తుంది
- చల్లదనం, హాయిని చేకూర్చి తక్షణ ఉపశమనము చేకూరుస్తుంది




స్నానము తదుపరి మరియు నిద్రపోవుటకు ముందు జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు విరళంగా చల్లండి అది ఒక్కటే తల్లులు విశ్వసించే ఔషధీయుక్తమైన పౌడరు, చెమట పేలుడు నుంచి ఉపశమనమును కల్గించేది — తక్షణమే.

చందనపు సువాసనలో గూడా దొరుకుతుంది

## ఒక్క జాన్సన్స్* ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే మంటను ఆపుతుంది, దురదనుంచి ఉపశమనం ఇస్తుంది. తక్షణమే.

Johnson & Johnson*

# మంచిని పెంచి చూడు

మీ అరూని, పిల్లల్ని ఈవేళ కళకళలాడుతూ చూసుకో గలిగేవారా మీరు?"

"ఛీ! ఈ సంగతి విన్నాక నాకు ఒంటి మీద తేళ్లు జెర్రులు ప్రాకినట్లుగా వుంది ఈ శరీరం ఎవరికో అమ్ముకున్నట్లుగా. ఛీ ఛీ! ఇంత బ్రతుకూ బ్రతికి"

"మీరలా ఎందు కనుకోవాలి? మీరేం అన్యాయం చేసి సంపాదించలేదివన్నీ—మీరు ఉద్యోగం చేస్తున్నారు వాళ్లు జీతం ఇస్తున్నారు అంతే! అంతకుమించి ఇందులో తప్పేముందని!"

"ఆత్మవంచన చేసుకోవటం ఎప్పటినుంచి నేర్చుకున్నావు అరూ!"

"మీ రాత్మనింద మానేస్తే నాది ఆత్మవంచన అనిపించదు ఒక్క క్షణం ఆలోచించండి కొండల్లో, అడవుల్లో దురుసుగా ప్రవహించే నదిని మాత్రమే చూశారు మీరు ఆ నీళ్లే సమతలంమీద ప్రవహించాక సూర్యరశ్మికితేటతేరి మధురజలంగా మారిపోతాయి ఆ నది, ఈ నది ఒక్కటి కాదని మొండిపట్టు పడితే నేనేం చెప్పగలను? నేను కళ్లారా చూసాను మీరు చూడలేదు ఇప్పుడు నాతో రండి చూడండి అప్పటికీ నమ్మలేకపోతే మీరేంచేసినా అడ్డుపెట్టను ఈ ఉద్యోగానికి రాజీనామా ఇస్తానన్నా బాధపడను మీతోటే నాజీవితం అర్ధాంకలితో ఉండమన్నా, కళకళలాడుతూ ఉండమన్నా—ఈ జీవితాన్ని శాసించేది మీరుకాక మరెవ్వరు? మీరు చెప్పిన విద్యేనండీ! ప్రతిమనిషిలోనూ మంచిని చూడటం ఒక్కటేనాకు తెలుసు— ఆనాడు అనాథ శరణాలయంనుంచి నన్ను తెచ్చుకున్న మీలోని దైవాన్ని నేను ప్రతి మనిషిలోనూ చూస్తానండీ!" అంటూ అతని గుండెలమీద వాలిపోయింది అరవింద

ఆమె కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. ప్రభాకర్ చలించి పొయ్యాడు

* * *

"ఈగదిలో కూర్చోండమ్మా! అమ్మగారిప్పుడే వచ్చేస్తున్నారు" అని పనిమనిషి డ్రాయింగ్‌రూమ్ చూపించింది

అరవింద భర్తతో, పిల్లలతో ఆగదిలో అడుగుపెట్టింది గతంలో అక్కడికెన్నోసార్లు వచ్చింది ఎప్పుడూ కూర్చోమని కాళింది అడగలేదు తనూ ఆ విషయమే ఆలోచించలేదు కాని, ఇప్పుడు భర్తతో వచ్చాక... పైగా



ఇప్పటి కాళింది గురించి ఎంతో చెప్పాక అతన్ని అలా నిలబెట్టటం తనకే సిగ్గనిపించింది

"కూర్చోండి ఆమె చూసిందంటే బాధపడుతుంది!" అంది అరవింద

ప్రభాకర్ మౌనంగా కూర్చున్నాడు పిల్లలిద్దరూ ఏదో గుసగుసలాడుకుంటూ తండ్రిపక్కనే కూర్చున్నారు అరవింద గోడలమీదున్న తైలవర్ణ చిత్రాలు పరికిస్తూ తచ్చాడుతూంది కాని, ఆమె దృష్టంతా కాళింది రావాల్సిన గుమ్మం మీదనే ఉంది

ఐదు నిమిషాలు అతికష్టంగా గడిచాయి ప్రభాకర్ కళ్ళు తన్నెదుర్కొనేసరికి రెండుసార్లు అపరాధినిలా తల త్రిప్పుకుంది అరవింద

ఆఖరికి గుమ్మం దగ్గర చప్పుడయి అంతా చటుక్కున అటువైపు తిరిగారు పనిమనిషి ట్రేలో ఏవో ఫలహారాలు తీసుకువచ్చి వాళ్ళ ముందు పెట్టింది

మంచినీళ్ళతో ఆమె రెండోసారి వచ్చినప్పుడు, "ఆవిడేరమ్మా!" అని అడిగింది అరవింద

"వస్తున్నారమ్మా! ఇప్పుడే ఇదిగో వచ్చేస్తారు మిమ్మల్ని ఫలహారం చేస్తూండమన్నారు"

"ఫర్వాలేదు వారినికూడారానీ కాసేపు కూర్చుంటాము" అంది అరవింద

పనిమనిషి వెళ్ళిపోయింది మరో పది నిమిషాలు గడిచాయి కాళింది రాలేదు పిల్లల దృష్టి ఫలహారాలమీద—పెద్దవాళ్ళ దృష్టి గది గుమ్మంమీద—ఎవ్వరూ కదలటంలేదు

ప్రభాకర్‌వైపు చూడ్డానికే భయపడుతోంది అరవింద! ఆమెకంత కంతకూ

(44 వ పేజీ చూడండి)

# ఈ సంఘంలో కుటుంబమే ఇది!

## అన్నపూర్ణ

"వారి కాసిని నీళ్ళు పడెయ్యమ్మా అరుణా వాళ్ళు వచ్చారు"

"వాళ్ళు అంటున్నావ్ ఇంకెవరు వచ్చారు అరుణలో?" అడిగింది కామేశ్వరి

"పెళ్ళి ల న్నయ్య వచ్చాడు నాన్నగారితో మాట్లాడ మా కూర్చున్నారు హాల్లో" అని ఆ సంతోషంలో కాలు ఒకచోట నిలవనట్లు తిరిగి తన గదిలోకి వచ్చేసింది శ్యామల ఆమెకు హాలులో వాళ్ళు మాట్లాడుకొనే మాటలు అస్పష్టంగా వినిపిస్తున్నాయి

"వివాహం అనేది నూరేళ్ళ పంట ముఖ్యంగా ఆడపిల్ల జీవితానికి ఇదో పరీక్ష లాంటిది" అంటున్నాడు గోపాలరావు

"నిజమే మీరు చెప్పింది అయితే నేను పెళ్ళి చేసుకొనే ఉద్దేశ్యం మనసులో పెట్టుకోకపోతే శ్యామలతో చనువు పెంచుకొనేవాణ్ణే కాదు"—ఇది ప్రకాష్ మాట

"కావచ్చు ఏదైనా చిన్నవాళ్ళు. మీది ఉడుకు రక్తం .అదెప్పుడు చల్లబడుతుందో అప్పుడే మీ ఆదర్శాలు కూడా చప్పబడి పోతాయ్"

"ఆడపిల్ల తండ్రిగా మీ అనుమానాలు, అపోహలు ఏమిటో నేను ఊహించుకోగలను . నా మాటల్లో—తొందరపడి నేనెలాంటి నిర్ణయానికీ రాలేదనే"

"సరే ప్రకాష్ అయితే నీ తల్లి దండ్రుల మాటేమిటి మరి ?"

"నా అంగికారాన్ని వాళ్ళు తప్పక ఆమోదిస్తారు"

"వాళ్ళకు తెలుసా ఈ విషయం?"

"మీ అభిప్రాయాలు ఎలా ఉన్నాయో—తెలుసుకున్న తర్వాత వాళ్ళకు చెబుదామనుకున్నాను"

"మా అభిప్రాయాలు .. నీ విషయంలో ఆడపిల్ల తండ్రిగా నా కెలాంటి అభ్యంతరాలు లేవు కారణం మీ యిద్దరి భావాలు తెలుసుకున్నాను ఇక తీర్పుమాట—అది మీ పెద్దల నిర్ణయంపై ఆధారపడి ఉంటుంది"

అంతవరకు అక్కడే కూర్చొని ఉన్న అరుణ లేచి శ్యామల దగ్గరకు వెళ్ళింది అప్పుడే కామేశ్వరి కాఫీలు తెచ్చింది

"ఇతడు అరుణ అన్న ప్రకాష్- అంటూ అతణ్ణి మామూలుగా పరిచయం చేశాడు గోపాలరావు. అసలు సంగతి తర్వాత తీరిగ్గా వివరించవచ్చునన్నది అతడి ఆలోచన

భర్తకు, ప్రకాష్‌కు చెరోకప్పు అందించి—

(గత సంచిక తరువాయి)

గదిలోంచీ మాటలు వినిపిస్తూండటంతో అరుణ అక్కడే ఉంటుందని తనూ గదిలోకి వెళ్ళింది కామేశ్వరి

గోపాలరావు దృష్టి తలవంచుకొని కాఫీ త్రాగుతున్న ప్రకాష్‌మీదే ఉంది

ఆరడుగుల ఆజానుబాహు విగ్రహం . ఛాయ ఒక వీసం తక్కువైనా ఆముఖంలో రాజఠీవి కనిపిస్తోంది . పైగా డబ్బుంది హోదావుంది మాటలనుబట్టి అతడిది మంచి మనసుగా కూడా తోస్తోంది . . నిజంగా —ఇంతటి వాడికి తనకూతురు అర్ధాంగి కావటం సంభవిస్తే—అదెంతటి అదృష్టం !

ఏదో మాటవచ్చి అరుణ, శ్యామల నవ్వుకోవటం, వాళ్ళకు కామేశ్వరి శ్రుతికలపటం—తెలుస్తూనే ఉంది అక్కడకు

> **జరిగిన కథ: 4** గోపాలరావు కామేశ్వరిల సంతానం రాము, కృష్ణ, శ్యామల, మధులు స్నేహితుల ప్రవర్తన వల్ల పేకాట మానుకుంటాడు గోపాలరావు తన బాధ్యతా రహితమైన ప్రవర్తన వల్లే పిల్లలు పెడత్రోవ పట్టారని గ్రహిస్తాడు గోపాలరావు తండ్రితో ఘర్షణపడి ఇంట్లోంచి వెళ్ళిపోయిన రాముడు పాత పుస్తకాల షాపు పెట్టుకుంటాడు శ్యామలని ప్రేమించిన ప్రకాష్ చెల్లెలు అరుణతో సహా ఆమె ఇంటికి వస్తాడు

మరి కొంత సేపటి తర్వాత అరుణను పిలిచాడు ప్రకాష్ వెళ్ళటానికి సిద్ధపడి

అరుణ వచ్చింది

శ్యామల కనిపిస్తుందేమో ఒకసారి అని అరుణ వచ్చిన దిక్కే కొన్ని క్షణాలు చూసి నిరాశగా లేచాడు ప్రకాష్

ప్రకాష్ ముందుకు వెళ్ళి అతడితో మనసారా కాసేపు మాట్లాడాలని శ్యామలకూ ఉంది అయితే తండ్రి ఏమంటాడోనన్న భయం—ఆమె అన్ని ఆరాటాలను బలవంతాన అణిచి వేసింది

వాళ్ళటు వెళ్ళగానే ఇటు కామేశ్వరి వచ్చి అడిగింది భర్తను

"ఏమిటండీ మీరు అంతసేపు మాట్లాడారు ఆ అబ్బాయితో ?" అని

ఇక దాచి లాభంలేదని అసలు సంగతి వివరంగా చెప్పేశాడు భార్యకు గోపాలరావు

"అలాగా ! ఇన్నిరోజుల్నించీ అమ్మాయిగాని, మీరుగానీ నాతో మాట వరసకైనా అన్లేదు ఎలాగైనా మీరూ మీరూ ఒకటి. నేనేగా పరాయిదాన్ని" అంది కామేశ్వరి నవ్వుగానే

"కుర్రవాడు బుద్ధిమంతుడిలానే కనిపించాడు మరి అతని పెద్దవాళ్ళు ఏమంటారో" —ప్రకాష్ తన అల్లుడవుతాడని గట్టిగా విశ్వసించలేక పోతున్నాడు గోపాలరావు

"అమ్మాయి లలాట లిఖితం బాగుంటే వాళ్ళు అవుననటం ఎంతసేపులెండి . పచ్చి ఏలోకాన ఉన్నాడో మానాన్న— శ్యామ పుట్టినప్పుడే దాని జాతకం చెప్పేశాడు ఆయన . . నేను కన్న సంతు అందర్లోకి ఆడపిల్లే అన్ని విధాల సుఖపడుతుందట !"

గోపాలరావుకూ తన మామగారు గుర్తు వచ్చాడు ఆయన మంచి జ్యోతిష్కుడు 'నీవు నీ ఎంతతివల్ల కొంత మనస్తాపం పొందవలసి ఉంటుంది భవిష్యత్తులో' అని ఒకసారి తనను గురించి చెప్పాడు అలాగే అక్షరాలా జరుగుతోంది ఇప్పుడు .. ఇక శ్యామల—దాని విషయంలోనూ ఆయన చెప్పినట్లే జరగవచ్చు అందుకు అవకాశంకూడా కలిసి వచ్చింది మరి . ఎంతైనా తన కూతురు ప్రకాష్ అర్ధాంగి కాక తప్పదన్నమాట !! ఎంతటి అదృష్టం అమ్మాయిది !!

ఇంతలో మధు లోపలకు వచ్చాడు, "నాన్నగారూ! రాము అన్నయ్య వచ్చాడు" అంటూ

"పెద్దాడు వచ్చాడా? ఏడిరా" అంటూ

కుర్చీలో కూర్చొని ఉన్న కామేశ్వరి తటుక్కున లేచి వీధి మొత్తవైపు చూసింది

రాము వరండాలో పరాయి వాడిలా— సందెహిస్తూ నిలబడి ఉన్నాడు అతడి దైన్యస్థితిని తలుచుకున్న ఆ తల్లి గుండె తరుక్కుపోయింది

"అలా నిలబడిపోయావేంరా ?, రా లోపలకు" అంది పైకి

అతడిచేతిలో పండ్లబుట్ట, పూల పొట్లం ఉన్నాయి లోపలికివచ్చి అవితల్లి చేతికి యిచ్చి, "ఇవి నా సంపాదనతో కొని తెచ్చినవమ్మా తీసుకో చెల్లాయి లేదా ఇంట్లో ?" అడిగాడు చెల్లెలు శ్యామలంటే అతడికి మొదట్నుంచీ ఒక ప్రత్యేకాభిమానం

"ఉంది శ్యామూ! రాము అన్నయ్య వచ్చాడె పలుస్తున్నాడు రా," అందికామేశ్వరి తన కొడుకు ప్రయోజకుడయ్యాడు ఆమె సంతోషానికి పట్టపగ్గాలు లేవు

ప్రకాష్ వచ్చి తండ్రితో మాట్లాడి వెళ్ళింది మొదలు—తీయని కలలు కంటూ కాలం గడుపుతున్న శ్యామల—తన సుందర స్వప్నాలు మధ్యలో ఆగిపోతున్నందుకు ఒక ప్రక్క విసుక్కొంటూనే వచ్చింది అక్కడకు

చెల్లెలికి ఇష్టమని ప్రత్యేకంగా తెచ్చిన గులాబి పూల పొట్లం జేబులోంచి తీసి శ్యామల చేతిలో పెట్టాడు రాము

"అన్నయ్య తన స్వంత సంపాదనతో మన కివి తెచ్చాడే !" అంది కామేశ్వరమ్మ మురిసి పోతూ

శ్యామలకూ తన పెద్దన్న విషయంలో నమ్మకం కుదిరింది-ఎందుకూ కొరగాకుండా పోతాడనుకున్నవాడు ఈ రోజు తన సమర్థతను నిరూపించుకున్నాడు మరి అతడివైపు కృతజ్ఞతగా చూసింది అంతకుమించి మాట్లాడవలసింది తోచలేదు ఆమెకు

ఆ తర్వాత రాము తండ్రిమంచం దగ్గరకు వచ్చి—ఆయనకు తన ముఖం చూపలేనట్లు తలవంచుకొని నిలబడి,

"ఆ రోజు తొందరపడ్డాను నాన్నగారూ ఆ తర్వాతచాలాచాలా ఆలోచించాను" అన్నాడు

" నీలో పరితాపం రగలటం నేనప్పుడే గమనించాను . ఆ మాటే మీ అమ్మతో అన్నాను అసలు కారణార్థం లేందే ఏమీ జరగదు రామూ ఆ నాడు అలాజరిగి ఉండక పోతే ఈ నాడిలా నువ్వు మమ్మల్ని సంతోష పెట్టగలిగే వాడవు కావు ఇంకోటేమిటో తెలుసా? కలతలు కలకాలం నిలవవు ఇప్పుడు



అనుకున్నది ఇంకా సేపటికి మరిచిపోవాలి . పోతాం—ఇదే రక్తసంబంధంలో ఉన్న గొప్ప తనం అవునా, కాదా?"— జరిగిపోయిన దుస్సంఘటన మీంచీ కొడుకు దృష్టిమళ్ళించి అతడిలో తనపై విశ్వాసం కలిగేట్లు చేయాలని అన్నాడు గోపాలరావు

అవునన్నట్లు తల ఊపాడు రాము

తర్వాత కొడుకును తన ప్రక్కనే కూర్చో బెట్టుకున్నాడు తండ్రి అడిగిన మీదట తన 'స్టాల్'కు సంబంధించిన వివరాలు చెప్పాడు రాము'

'మొత్తం వెయ్యి రూపాయలకు ఒకడి దగ్గర్నుంచీ కొన్నాను "

"వెయ్యిరూపాయలా ? అంత పెట్టు బడి నీకెలా సమకూడింది ?"

"నాకు తెలిసిన ఒకళ్ళు సహాయంచేశారు నేనిప్పుడు ఉండటం తినటం కూడా అక్కడే ."

"పోనీలే నీ బతుక్కిస్థిరత్వం ఏర్పడింది నాకంతే చాలు . . అయితే నీకు సహాయండిన అతడేం చేస్తుంటాడు?"

"అతడు కాదు నాన్నగారూ, ఆమె "

ఏదో అనబోయాడు గోపాలరావు కాని, అంతలోనే లోపల్నుంచి కామేశ్వరి పిలుపు

"ఫలహారం చేద్దుగాని రారా అబ్బాయ్"— మధు కొరకని దాచిన ఉప్మానే చెరిసగం చేసింది ఆమె

అక్కడ మరి కాసేపు ఉంటే తండ్రి



## ఈ సంఘంలో కుటుంబమే ఇది!

ఏమడుగుతాడో, తను ఏం జవాబు చెప్పవలసి వస్తుందోనని తల్లి పిలుపు విని వినటంతోనే లేచాడు రాము

కొడుకు చెప్పిన దగ్గర్నుంచీ 'ఆమె'ను గురించే ఆలోచిస్తున్నాడు గోపాలరావు. ఎవరామె? వయసెంత ఉంటుంది? వివాహితా, అవివాహితా?, ఆమెదీ, వీడిదీ ఏ విధమైన సంబంధం? అసలు వీళ్ళిద్దరికీ ఎలా పరిచయమయింది? — ఇలా చాలా చాలా ప్రశ్నలు అతడి మెదడులో సుడులు తిరుగుతున్నాయి

తల్లి పెట్టింది తిని ఇవతలకివచ్చాక "నేనిక వెళ్తాను" అన్నాడు రాము

అతడి కూడానే ఉన్న కామేశ్వరి "అదేమిట్రా అప్పుడే వెళ్ళటం? భోంచేసి వెళ్దుగానిలే" అంది

"భోంచేశాకమాత్రం ఎక్కడికో వెళ్ళటం దేనికి? ఇక్కడే పడుకో ఎవరూ లేనట్లు నువ్ పరాయిపంచన కాలం గడపటం ఎందుకు రామూ?" అన్నాడు గోపాలరావు పుత్రవాత్సల్యంతో

"నావిషయంలో మీరెవరూ మనసు బాధపెట్టుకోవద్దు నాన్నగారూ .నాకు అందరూ ఉన్నారు కాబట్టే ఈనాడిలా వచ్చింది, "

"మరింకేం?. ఆ భావన నీలో ఉన్నప్పుడు ఇక ఇక్కడే ఉండిపో "

"నన్ను బలవంతం పెట్టకండి నేను మాటకు కట్టుబడి ఉండేవాణ్ణి నాన్నగారూ ."

గోపాలరావుకు బదులు ఈసారి కామేశ్వరి అంది

"సరే, నీ యిష్టం వచ్చినచోటే ఉండు . కానీ, ఈపూటకు నే చేసిపెట్టింది తిని వెళ్ళు "

"ఆమెకు నేను చెప్పిరా లేదు . నా కోసం ఎదురు చూస్తూంటుంది . మరోసారి వస్తాగా ?"

"ఇంతకూ—ఎవరామె?" మనసు పట్టలేక సమయం చూసి అడిగేశాడు గోపాలరావు

"నిలువ నీడలేని నాకు చోటు యిచ్చింది. బ్రతుకు లేని నాకు ఒక తెరువు చూపింది . ఆమెను గురించి ప్రస్తుతం ఇంతక

# గొప్ప సంధానకారి

సర్‌సిల్క్. దృష్టినాకట్టే ఉత్తేజకరమైన ముదురు రంగులలో. చక్కని లేత రంగులలో. సాదా, చారలు మరియు గీతలలో.

సర్‌సిల్క్ నాణ్యమైన బట్టలలో మీరు కోరేవన్నీ సమకూర్చే సూటింగులు మరియు షర్టింగులు మీకు చేకూర్చ గలదు. మన్నిక గలవి. మంచి నాగరికతాభిరుచులకు దీటైనవి. వాడకానికి తేలిక. సరిగ్గా సమ్మతమైన ధర.







**సర్‌సిల్క్**

**పాలియస్టర్ సూటింగులు మరియు షర్టింగులు**

ASP/SSI/751

సెల్లింగ్ ఏజంట్లు: ఆంధ్ర ప్రదేశ్: కలకత్తా మర్చంట్స్ & ఏజెంట్స్ (ప్రై) లిమిటెడ్, 11-41-51, కందుల వారి వీధి, విజయవాడ. తెలంగాణ: రంగ్వా & కో. పథేర్ గట్టి, హైదరాబాదు. కర్ణాటక: మోడరన్ డీలర్స్ (ప్రై) లిమిటెడ్, కెంపెగౌడ రోడ్, బెంగుళూరు, తమిళనాడు & కేరళ: హిందుస్థాన్ డీలర్స్ లిమిటెడ్, 4, స్ప్రింగర్ స్ట్రీట్, మద్రాసు.

యించి చెప్పలేను ''అని—వెంటనే ఆ సంభాషణ మార్చివేసే ప్రయత్నంగా, "కృష్ణ ఏడమ్మా ?'' అనడిగాడు రాము

"వాడు ఏదో ఊరు వెళ్తానని చెప్పి వెళ్లాడు . నిన్ననే రావలసింది రాలేదు . ఈ రాత్రికి వచ్చేస్తాడులే ... '' అన్నది కామేశ్వరి

'అబద్ధం నాన్నగారూ, మీరు అంత తీవ్రంగా ఆలోచించవలసింది నన్ను గురించి కాదు కృష్ణను గురించి'' అన్నాడు తండ్రి వైపు తిరిగి

"ఏం? వాడేంచేశాడు ?''—కనుబొమ్మలు ఎగురవేశాడు గోపాలరావు.

''ఇంట్లో అబద్ధాలు చెబుతున్నాడు . నిన్న సాయంత్రమే సెంటర్లో చూశాను వాణ్ణి ఎవరితోనో కలిసి వెళుతున్నాడు

తన గట్టి నమ్మకాల్ని గాలిమేడల్లా కూలిపోతున్నట్లే విలవిల్లాడిపోసాగాడుగోపాలరావు

''అంతేకాదు నాన్నగారూ ... కృష్ణను గురించి చెప్పాలంటే చాలాఉంది ఈ వూళ్లో పేరుమోసిన రౌడీల రహస్యముఠా ఉంది. . వాడూ వాళ్ళతో చేతులు కలిపి తిరుగుతున్నాడు ఆ ముఠా వాళ్లందరితోపాటే వాడి జాతకమూ పోలీసుల లిస్టులో ఉందట చుట్టుపక్కల ఏ హడావిడి జరిగినా వెంటనే వాళ్లందర్నీ మూసేస్తారట... నాకు తెలిసిన హెడ్ కానిస్టేబుల్ ఒకడుచెప్పాడు ప్రొద్దున. కృష్ణ నాకు మాత్రం సోదరుడు కాడూ? .. అర్థంలేని ఆలోచనలు మనసులో పెట్టుకొని అన్యాయమై పోకూడదు వాడు అందుకే మనసులో ఉన్న ఈ రహస్యాన్ని కన్నవారు కాబట్టి మీ చెవిన వేస్తున్నాను ఇప్పటికీ మించి పోయింది లేదు' చేతనయితే తమ్ముణ్ణి అదుపులో పెట్టండి వస్తాను ''అని చెప్పి వెళ్లిపోయాడు రాము

# ఈ సంఘంలో కుటుంబమే ఇది !

"ఇదేం ఖర్మండీ ? . మన కిష్టిగాడు ఇలా తయారవుతున్నాడు . ''అంది కామేశ్వరి ఆందోళనగా

గోపాలరావు పెదవి కదిపే స్థితిలో లేడు కూతురి సంబంధంగురించీ, పెద్ద కొడుకులో మార్పుగురించీ—అంతవరకు అతడు అనుభవించిన సంతోషం అంతా పటా పంచలై—వెలుగువెంట గాఢాంధకారంలా కృష్ణను గురించిన విచారం ఆవరించిందతని మనసును.

* * *

ఆ తర్వాత మూడు రోజులు ఎలాంటి చెప్పుకోదగిన సంఘటన లేకుండానే గడిచిపోయాయి గోపాలరావు ఒంట్లో కులాసాగానే ఉంటున్నా మరో నెల రోజులు శలవు పొడిగించాడు క్రెడిట్‌లో అతనికి చాలా ఎర్న్‌డ్ లీవు ఉంది.. ఇంటి ముఖమే చూడలేదు కృష్ణ అప్పట్నుంచీ రాము కూడా మళ్లీరా లేదు మధు కాలేజీకి వెళ్ళి వస్తున్నాడు

ప్రకాష్ గోపాలరావు ఇంటికి వచ్చి వెళ్ళిన నాడే అతడి తండ్రి ఏదో వ్యాపార సంబంధమైన పనిమీద హైద్రాబాద్ వెళ్ళాడు ఆ కారణంగా మరో వారం పది రోజుల వరకు శ్యామల పెళ్లిని గురించి మాట్లాడటానికి ఆయన రారని తెలిసింది క్రితం రోజే అరుణ వచ్చి ఆ విషయం చెప్పి వెళ్లింది

ఎవరి మాట ఎలా ఉన్నా శ్యామలకు కొంత ఆశా భంగం కలిగిందా సంగతి తెలిసి తమ విషయం ప్రకాష్ తన తండ్రికి చెబుతాడనీ, అతడి తండ్రి సుందరరావు వెంటనే వచ్చి తన తండ్రితో మాట్లాడుతాడనీ, తొందరలోనే తమవివాహం జరిగి—ప్రకాష్ అర్ధాంగిగా వాళ్లింట తను కాలు పెడుతుందనీ, అనురాగంగా చూసుకొనే భర్త, అభిమానించే అరుణ గౌరవంగా చూసే అత్తమామ ఆ స్వర్గధామాన్ని తను అమృతప్రాయంగా జుర్రుకొంటుందనీ—ఇలా తీయ తీయగా ఊహించుకొంటోందామె మరి

గోపాలరావుకు ఒంటరిగా ఇంట్లోకూర్చొని ఏం చేయాలో తోచటం లేదు కృష్ణ సంగతి తెలిసింది మొదలు అతడిలో ఒకటే పిచ్చి పిచ్చి ఆలోచనలు కొన్ని సందర్భాలలో మతిలేనట్లే మాట్లాడుతున్నాడు—అస్తమానూ రెండో కొడుకు కోసమే ఎదురు చూపు—

ఏదో సంఘటన జరిగి వాడూ పెద్దకొడుకులా ఒక్కసారిగా పరివర్తన చెందుతాడేమో అన్న ఆశ—

మొగ పిల్లల ప్రవర్తన కారణంగా ఆడపిల్ల జీవితం అన్యాయం యిపోకూడదు—వాళ్ళు చేసిన దానికి ఫలితం అనుభవించకూడదు— అంది వచ్చి బంగారంలాంటి సంబంధం ఏ విధాన కాకుండా పోకూడదు అన్న ఆకాంక్ష—

మూడవ నాటి సాయంత్రం— తను ఇక ఇంట్లో కూర్చొని లాభంలేదు—అలాబజారుకు వెళ్ళిరావటం మంచిది— కనీసం సెంటర్లో రాముడయినా కనిపిస్తాడు కృష్ణ ఆ చూకీ వాడికేమయినా తెలుసూండవచ్చు— ఎక్కడ ఉన్నా వెతికి పట్టుకోవాలి కృష్ణను—చెల్లెలి భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొనైనా వాడు తన ప్రవర్తన మార్చుకొనే ప్రయత్నం చేస్తాడేమోనని గంపెడు ఆశతో బయలుదేరాడు గోపాలరావు

అప్పటికి సాయంత్రం అయిదు గంటలు దాటింది .. రాను రాను సూర్యుడిలో జీవశక్తి నశించిపోయింది



## ఈ సంఘంలో కుటుంబమే ఇది!

బజార్లో ఎటుచూసినా జనం — రిక్షాలు వెడుతున్నాయి-కార్లు పరుగెత్తుతున్నాయ్— స్కూటర్లు దూసుకు పోతున్నాయ్ — ఇంకా లాగుడు బళ్ళు, సైకిళ్ళు — ఓహ్! ఒక టేమిటి? రకరకాల వాహనాలు!

అన్ని — అందర్నీ చూశాక ఈ ఊళ్లో ఇంతమంది జనం ఉన్నారా అనిపించింది గోపాలరావుకు

కాళ్ళతో నడిచేవాడు, సైకిల్ తొక్కేవాడు రిక్షామీద వెళ్లేవాడు, కారుమీద పోయేవాడు— అందరికీ తొందరే — ఎక్కడికి వీళ్ళగమ్యం? ఏమిటి వీళ్ళ నిత్య కార్యక్రమం? అవతల ఏం మునిగిపోయిందని వీళ్ల తొందరపాటు?

— అనవసరమైన ఆలోచనలకు, చిక్కు ప్రశ్నలకు చోటు ఇచ్చాడు గోపాలరావు తన మనసులో ఇంకా అతడు సమాధానం కోసం ప్రయత్నించే లోపలే —

"గోపాలరావుగారూ!" అన్న పిలుపువిని తల పూర్తిగా ఎత్తాడు

ఎదురుగా కోదండం!. ప్రక్కనే ఉన్న హోటల్‌లోకి వెళ్లే ప్రయత్నంలో ఉన్నట్లు దానిముందు నిలబడి ఉన్నాడు అతడు—

కోదండం పట్టు బలవంతాన గోపాలరావు కూడా హోటల్లోకి వెళ్లాడు

"ఒంట్లో కులాసా చిక్కిందా?" అని మొదలుపెట్టి "మళ్లీ శలవు పొడిగించటం" వరకు ప్రశ్నలు వేశాడు కోదండం

అన్నింటికీ సమాధానం చెప్పి ఊరు కున్నాడు గోపాలరావు

హోటలు నుంచి బయటపడ్డ తర్వాత "రండి మాయింటికి వెళ్దాం" అన్నాడు కోదండం

"మళ్లీ మీ యింటికా?" గోపాలరావు అడుగు వెనక్కు పడ్డది

"పరవాలేదులెండి గోపాలరావుగారూ, మీరు ఆదివరకు చూసిన యిల్లుకాదు నాది ఇప్పుడు మారాను దగ్గరే" అన్నాడు కోదండం ఉల్లాసంగా

"ఇల్లు మారావన్నమాట మంచిపని చేశావ్" అన్నాడు మాటవరసకు.

"రండి చూద్దురుగాని"

"మరోమారు వస్తాను. నాకు వేరే పని ఉంది"

"త్వరగానే వచ్చేద్దురుగానిరెండి. అదీగాక మీరొకటి అడిగారు కన్ను ఆవేళ చెబుదామనుకున్నాను కానీ ఎందుకో అదే హింసను ఎవ్వరయినను మీలాంటి ఒక్కరి సానుభూతి ఉంటే నాకు అంతేచాలు అందుకే మీకు నా ఆంతర్యం ఏమిటో విప్పి చెబుతాను మా కొత్త యిల్లు చూసిన తర్వాతనే బాగుంటుంది రండి."

ఇంకో ఇంకో సమయంలో అయితే కోదండం అంత బలవంతం చెయ్యకుండానే — అతని మాట వినేవాడు గోపాలరావు మరి

(34 వ పేజీ చూడండి)

# వారఫలం

—మహేష్

13-6-1975 శుక్రవారం మొదలు
19-6-1975 గురువారం వరకు

**మేషం:—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి సాటివారిలో గౌరవం లభిస్తుంది సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది ప్రయాణాలు వాయిదా పడతాయి స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది దైవకార్యాలు నెరవేరతాయి

**వృషభం —** వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది సజ్జన సాంగత్యం లభిస్తుంది స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి ముమ్ముందు బాధ్యత కలిగించే వాగ్దానాలు చేయటం తగదు విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు బంధుమిత్రులను కల్సుకొంటారు

**మిధునం —** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది రావలసిన డబ్బు అందుతుంది వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది

**కర్కాటకం —** ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి నూతన విషయాలను తెల్సుకొంటారు సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాలోచనలు చేస్తారు

**సింహం:—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి నూతన వ్యవహారాలు లాభించగలవు ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కన్య —** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది మిత్రుల సహాయం లభిస్తుంది వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో అనుకూలత లభిస్తుంది స్త్రీలకు—సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి అధిక వ్యయం జరుగుతుంది

**తుల —** అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి పుణ్య కార్యాలు చేస్తారు వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి వారం ఆఖరులో ప్రయోజనం లేని శ్రమ కలుగుతుంది స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది బంధువులకు సహాయం చేస్తారు

**వృశ్చికం —** రావలసిన డబ్బు అందుతుంది విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి మీరు యిదివరకుచేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు పుణ్య కార్యాలు చేస్తారు

**ధనుస్సు —** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రాగలదు వృత్తిలో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో అనుకూలమైన వార్తలను వింటారు వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగుంటాయి స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు నూతన విషయాలను తెల్సుకొంటారు

**మకరం —** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి రావలసిన డబ్బు అందుతుంది వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది

**కుంభం —** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి సాటివారితో వాదప్రతివాదాలు తగవు. మీ ఆలోచనలు ఫలిస్తాయి వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది అనవసరమైన వ్యయం జరుగుతుంది

**మీనం —** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి నూతన విషయాలను తెల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది అనవసరమైన సందేహాలు కలుగుతాయి ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు ●



సీరియల్

# శమంత - హేమంత

పి.వి.ఆర్.శివకుమార్

*(గత సంచిక తరువాయి)*

## 18

'అమ్మా అమ్మా ''

ఆదుర్దాగా వినబడుతున్న కంఠ స్వరానికి ఉక్కున మెళుకువొచ్చింది హేమంతకు తల ప్పి ధనలక్ష్మి మంచంవైపు చూసింది ఆమెకు ఉకువ రానట్లుంది

లేచి, గది బయటకు నడిచింది బయట ుబడున్నాడు, తోటమాలి రంగన్న

''ఏమిటి రంగన్నా ?'' అంది

''బాబుగారు ''

''ఊఁ! బాబుగారు ? ''

''తోటలో సోఫాలో పడుకుని వున్నా మ్మా! నేను లేచి, మొక్కలకు నీళ్లు పెడదామని తుంటే అగుపడ్డారు పిలిస్తే పలకటంలేదు '

అతడి మాటలు పూర్తి కాకుండానే గబగబ ోటలోకి నడిచింది హేమంత

మంచు కురిసి, ముత్యపు బిందువులు జాలు రుతున్న ఆ సోఫాలోనే మగతగా పడుకునివున్నాడు దిత్య

''మామయ్యా! మామయ్యా!'' భుజాలు ్టి కుదిపింది హేమంత

''ఊఁ ఊఁ '' మెల్లగా కళ్లు తెరిచాడు దిత్య జ్యోతుల్లా వున్నాయతడి కళ్లు

అనుమానంగా ఒళ్లు పట్టి చూసింది జ్వరం చ్చినట్లు మాడిపోతోంది!

''రంగన్నా, ఆ చెయ్యి పట్టుకో!'' అంటూ తడిని లేపి నిలబెట్టింది

తూలుతూనే నడుస్తూ గదికి చేరాడు అదిత్య తర్వాత ఏం జరిగిందో అతడికి తెలియదు

అప్పుడు సమయం తెల్లవారుఝాము న యిదు!

* * *

పూర్తిగా రాత్రంతా చలిలో, మంచులో తడవ ంతో, ఆదిత్య జ్వరం న్యూమోనియాలోకి ంపింది వారం రోజులదాకా జ్వరం నుండి బయట డలేకపోయాడు

ఆ వారం రోజులూ, యిష్టం లేకపోయినా ేమంత చేత సపర్యలు పొందక తప్పలేదతడికి

అహోరాత్రులూ అతని మంచందగ్గరే వుండి ోయింది హేమ అర్ధరాత్రులూ, కలతనిద్రనా లవరించేవాడు ఆదిత్య

విషయాలు పూర్తిగా కాకపోయినా అను ానం కలిగేటంతవరకూ అర్ధమయ్యాయి ఆమెకు

'అయితే! మామయ్య ఎవర్నో ప్రేమించాడన్న ాట! మరి ? అమ్మమ్మ కీ విషయం తెలుసా?'

ఆమెకి దుఃఖం పొంగివచ్చింది

'ఎందుకింత నాటక మాడాలి తనతో ఆమె ? తనతోనూ ఎందుకాడించ ప్రయత్నించాలి ?

అవును మామయ్యంటే తనకు చిన్నప్పట్నుంచీ యిష్టమే అతడితో జీవితం పంచుకోవాలనీకోరికే!

కానీ, అతడంటే తనకు ప్రేమ తప్ప ద్వేషం లేదు తనమీద కాక, వేరొకరిమీద మనసుంచుకున్న అతణ్ణి బలవంతాన తనవైపు తిప్పుకునే ప్రయత్నం తనవల్ల కాదు

కానీ, అమ్మమ్మ ఎందుకలా అబద్ధమాడింది?

'పిచ్చిదానా, మామయ్యకు నువ్వంటే యిష్టమే! కానీ, ఏవో తెలియని గొడవల వల్ల, అతడెందుకో యీమధ్య అన్యమనస్కంగా వుంటూ చాలా బాధ పడుతున్నాడు నాతో కారణమైనా చెప్పట్లేదు

ఎప్పటికైనా, నువ్వీ యింటికి రావల్సినదానివే! యిప్పుడే వచ్చి, వాడి బాధను అర్థం చేసుకుని, పోగొట్టటానికి ఎందుకు ప్రయత్నించకూడదు ?

తన యీడు దానివి గనక, నీతోనైనా చెప్పు కుంటాడేమో '' అని మభ్యపెట్టి తీసుకువచ్చింది

తనూ పిచ్చిదానిలా, ఏవో యితరేతరమైన కలతలనుకుని, వెంటబడి వేధిస్తూ, తరచి తరచి విసిగిస్తోందతణ్ణి — చెప్పమని!

ఏమని చెప్తాడు ? ఎలా చెప్తాడు ?

'అమ్మమ్మనే అడగాలి ' అనుకుంది కళ్లు తుడుచుకుంటూ

ఆ రాత్రి హేమంత అడిగిన ప్రశ్నకు బిత్తర పోయింది ధనలక్ష్మి

''ఏమిటే నువ్వంటున్నది ? నిజమే ? బాబు ఎవరో అమ్మాయి పేరు కలవరిస్తున్నాడా ? నువ్వు తప్పు విన్నావేమో! వాడు 'హేమంతా' అనే వుంటాడు'' అంది అపనమ్మకంగా

''లేదమ్మమ్మా, నేను సరిగ్గానే విన్నాను 'శమంతా, నన్నూ తీసుకుపోరాదా' అంటా డొకసారి

నీకేం భయంలేదు శమా, నేను స్వయంగా ట్రీట్ చేయిస్తా' నంటాడొకసారి!

అవీ నన్నుద్దేశించేనంటావా ?''

తెల్లబోయింది ధనలక్ష్మి

''అవునా ? అయితే నేనే పొరబడ్డాను తల్లీ! వాడెవరి వలలోనో పడ్డాడన్నమాట '' అంది రుద్ధంగా

''ఛ ఛ అవేం మాటలు అమ్మమ్మా! ఆమె ఎవరో, ఎటువంటిదో తెలియకుండా తొందర పాటుగా మాట్లాడకు మామయ్య అనురాగాన్ని పొందగలిగిన ఆమె నిజంగా అదృష్టవంతురాలు'' హేమంత కళ్లలో నీళ్లు తిరిగాయి

''హేమా! కళ్లనీళ్లా! వూరుకో! ఛ ఛ విషయం నేను కనుక్కుంటానుగా! నువ్వు బెంబేలుపడకు'' దగ్గరకు తీసుకుంటూ అనునయంగా అందావిడ

''వొద్దొద్దు '' కంగారుగా అంది హేమంత, ''మామయ్యనేమీ అడగొద్దు అసలే వున్నాడు జ్వరం పైగా మన అనుమానాలతో మరింత బాధకు గురిచేద్దామా ?''

''అయితే విషయం తెలిసేదెలా ?'' రెండు నిమిషాలాగి, ఆవిడే మళ్లీ అంది, ''పోనీ, ఒకపని చేద్దాం పద '' అంటూనే, గబగబ అతడి గదిలోకి దారితీసింది అనుసరించింది హేమంత

డ్రాయర్లోని తాళంచెవులు అందుకుని, బీరువా తెరిచింది ధనలక్ష్మి బీరువా సొరుగులోంచి, పాత డైరీల కట్ట అందుకుంది

''అమ్మమ్మా! '' అదురుగా అరిచింది హేమ, ''డైరీలు చదువుతావా ?'

''కుసంస్కారినంటావా ? ఫర్వాలేదమ్మా! కన్నకొడుకు బాగుకోసం, సంస్కారహీనురాలినై చరించినా ఫర్వాలేదు

మరేం చెయ్యను ? వాడు చెప్పడు నాకు తెలియదు

ఎవరినైనా చేసుకోదల్చినా చెప్పవచ్చుగా ? ఆ బాధ, ఆవేదనా ఎందుకు ?

ఫర్వాలేదు హేమా, దయచేసి నాకు సహాయం చెయ్యి డైరీలు చూసి, విషయం నాకు చెప్పు '' అంటూ డైరీలని బలవంతంగా హేమంత చేతిలో పెట్టింది

సుతరామూ యిష్టంలేకపోయినా, ధనలక్ష్మి మాట బలానికీ, మానవసహజమైన కుతూహల బలహీనతకీ దాసురాలై, వాటిని తెరిచింది హేమంత

గతమంతా అవగతమైపోయింది యిద్దరికీ

డైరీలు చదవటం పూర్తిచేస్తూనే కళ్ళ నీళ్లతో చెంగు తడిపేసింది హేమంత

''నిజంగా యిలాటి మనుషులుకూడా వుంట రంటావా, అమ్మమ్మా ?'' గద్గదంగా అంది

''ఉండటమే కాదమ్మా, నాబాబు జీవితాన్ని మంటలపాలుకూడా చేశారుగా! వాళ్లు మనుషు కారు — నరరూప రాక్షసులు!''

**జరిగిన కథ 8** ధనలక్ష్మి కొడుకు ఆదిత్య డాక్టరు శమంత తండ్రి బలరామయ్యగారికి గుండెజబ్బు ఆదిత్య వైద్యం ప్రారంభిస్తాడు శమంత సంపాదనపై ఆధారపడాల్సి వచ్చినందుకు బాధపడుతూంటారు బలరామయ్యగారు మేనకోడలు శమంతను వివాహం చేసుకోవాలనుకుంటాడు ఆనంద్ స్త్రీ వ్యక్తిత్వాన్ని గుర్తించని ఆనంద్ శమంతకు నచ్చడు శమంత ఆరోగ్యం దెబ్బతిం టుంది ఆమెను వివాహ మాడ్తానని ఆదిత్య ఆమెకు తెలియజేస్తాడు శంకరం తండ్రితో పోట్లాడి యింట్లోంచి వెళ్ళిపోతాడు గుండెపోటు ఎక్కువై బలరామయ్యగారు చనిపోతారు ఆదిత్య ఫారిన్ వెళ్లి తిరిగి రాగానే శమంత వ్రాసిన ఉత్తరం చూసి ఆమె పిన్నివాళ్ళ సూటిపోట్లు భరించలేక ఆత్మహత్య చేసుకుందని తెలుసుకుంటాడు

ఆవేశమూ, ఆవేదనా కలిసి ధ్వనించాయి ఆమె కంఠంలో

వాటిని యథాస్థానంలో వుంచేస్తూ, మౌనంగా అక్కడినుంచి కదిలిపోయారు యిద్దరూ

## *19*

జీవచ్ఛవంలా తయారయ్యాడు. వారంరోజులు కాసిన జ్వరానికే ఆదిత్య

కళావిహీనమైన ముఖంతో, అతడలాగే హాస్పిటల్‌కి వెళ్లివస్తుంటే, బాధతో గుండెలు పిండినట్లవుతోంది హేమంతకు

'ఎంత చిలిపిగా, సరదాగా వుండేవాడు మామయ్య! ఎంతటి దుర్ఘటన జరిగిపోయిందతడి జీవితంలో!

ఎంత నిరాశలో మిగిలిపోయాడు!

కానీ—ఇక అతడి జీవిత శేషమంతా ఇంతేనా?'

డైరీలో అతడు వ్రాసుకున్న వ్రాతలు గుర్తుకు వస్తే, మరీ వణికిపోయేది –

'శిశిరాన్ని మిగిల్చి వెళ్లిపోయింది శమంత ఇక నా బ్రతుకులో వసంతం రాదు—వెన్నెల రాదు!'

'నా వైఖరి చూసి అమ్మ బాధపడుతోంది

కానీ ఏంచెయ్యను?

ఆమెకోసం, తిరిగి మునుపటి మనిషిని కాగలనా? ఉత్సాహంగా తిరగగలనా? ఉహుఁ అది నా చేతిలోని పనా?

ఆ రోజుల్లోని ఉత్సాహం కొనితెచ్చుకొన్నదా, యీనాడు మళ్లీ కొని తెచ్చుకోవటానికి?

ఏనాడెలా జీవించాల్సివుంటే, అలా జీవించక చేయగలిగిందేముంది?

నేను ఆనందంగా



వున్నన్నాళ్ళూ తనూ సంతోషంగా తిరిగింది ఈనాడు నా మనసున చీకట్లు ముసిరాయని — వాటి ప్రభావం ఆమెపైనా పడితే ? పడనీ !

ఏడ్చేందుకే పుట్టినవాళ్ళు, ఏడుపు మాని బలవంతాన నవ్వబోయినా, వికృత ధ్వనియితప్ప హాసలాస్యాలు వెలువడవు !

శాపగ్రస్తులు తాము అంతే !''

'హేమంత వచ్చింది అమ్మలో

ఆమెని చూస్తుంటే జాలి ఒకవైపు చిరాకు ఒకవైపు పిచ్చిపిల్ల ! యింకా చిన్ననాటి ఆ మామయ్యనే అనుకుంటోంది

ఆమె తన కళ్ళెదుట ఉన్నంతసేపూ, శమంత గుర్తుకువచ్చి బాధ ద్విగుణీకృతమౌతోంది !

ఎప్పుడు వెళ్తుందో — ఏమో !

'అమ్మయితే తమనిద్దర్నీ కలపాలని తెగ పాటు పడుతోంది వ్యర్థ ప్రయత్నం !''

'శమంతతో జరిగిన మానసిక వివాహం రద్దు చేసుకోగలడా ?

ఆమెతో — మానసికంగానైనా — తాననుభవించిన ఆనందాలు, అనుభవాలు మర్చిపోగలడా ?

ఎలా మర్చిపోగలడు ? ఎందుకు మర్చిపోవాలి ?

అసంభవం హేమతో వివాహం — తనకు పునర్వివాహమే !

అది అసాధ్యం '

'అంటే మూడు పదులుగూడా దాటని మామయ్య బ్రతుకులో నూరు వసంతాలూ నిండి నట్లేనా ?

వీల్లేదు మామయ్య మళ్ళీ మనిషి కావాలి

కేవలం, ఒక మనిషిని ప్రేమించినా — ఆమె చనిపోయిన తరువాత — మరణించిన వ్యక్తికోసం నిండు జీవితాన్ని బలియివ్వటం త్యాగంకాదు ప్రేమాకాదు మూర్ఖత్వం — పిరికితనం !!

అవును — జీవితంతో రాజీపడలేని పిరికితనం !

ఒడుదుడుకుల్ని సహనంగా చూడలేని మూర్ఖత్వం !!

ఇదే సమంజసమైతే, సహగమనానికీ, దీనికీ తేడా ఏమిటి ?

అది దురాచారమని, దాన్ని రూపుమాపాలనీ మహామహులందరూ ఎందుకు ప్రయత్నించినట్లు ?

అలా కానివ్వను. ఏమయినా సరే, మామయ్యను తనవాణ్ణి చేసుకుతీరాలి

ఇన్నాళ్ళూ తను, అతడెవరినో ప్రేమించి, వివాహం కోసమే తపన పడుతున్నాడనుకొనే వూరు కుంది

కాని యిలాటి వైరాగ్యాన పడి, బ్రతుకు ఎండలు చేసుకొంటున్నాడని తెలిస్తే, ఎన్నడో తన ప్రయత్నాలు ప్రారంభించేది

ఎలాగో ఇంకా తెలియదు కానీ, అతడిని మళ్ళీ పూలబాటలోకి మార్చాలి '

స్థిరంగా అనుకుంది హేమంత

## 20

''రేపు నేను వెళ్ళిపోతాను అమ్మమ్మా !'' లంది, ఆ రాత్రి భోజనాల దగ్గర హేమంత

ఉలిక్కిపడింది వడ్డన చేస్తున్న ధనలక్ష్మి

''అదేమిటే ? ఎందుకు వెళ్ళిపోవటం ?''

# శమంత — హేమంత

''ఎందుకేమిటి ? ఇక్కడ బోరుకొడుతోంది అయినా, నాన్నని చూడాలనికూడా వుంది ఆయనా ఒక్కరూ వుండలేరు ''

తలవంచుకునే అంది హేమంత, వేలితో కంచంలో రాస్తూ

''నాన్నను చూడాలనుంటే ఫోన్ చెయ్యి — వస్తారు ఎన్ని మైళ్ల దూరమని మీ వూరు ?

నాకు తోడుగా యిక్కడుండవే అని తీసుకు వస్తే, నెల రోజులన్నా కాకుండానే వెళ్ళిపోతానంటావ్ — చిన్న పిల్లవా ?''

కోపంగా, ఉక్రోషంగా, బాధగా అంది ఆవిడ

''పోనీయమ్మా ! పాపం వాళ్ల నాన్నమీద బెంగ కాబోలు ! వెళ్లనియ్యి '' అన్నాడు ఆదిత్య అతడికి, ఆమె వెళ్ళిపోతుందంటే రిలీఫ్‌గా వుంది

''నువ్వు నోర్మూయ్యరా ! అసలు నీవల్లే ''

''అమ్మమ్మా ! '' గర్జించింది హేమంత

ఒక్కసారి ఆగిపోయింది ధనలక్ష్మి, ఆగి, అంది

''ఎందుకే అన్నావుతావు ? పెళ్ళీ, పెటాకులూ అక్కర్లేదు యీడొచ్చిన కోడలుపిల్ల నట్టింట నడయాడే భాగ్యం లేదు ఎద్దులా ఎదిగిన కొడుకూ, మొద్దల్లే మిగిలిన నేనూ — రెండు స్తంభాలల్లే పడుండాలి ఎల్లకాలమూ ''

**కొత్త రికార్డులు**

ఆస్ట్రేలియాకు చెందిన క్రిస్ వార్నర్ షార్క్ చేపల కొలనులో 54 గంటలు గడిపి ప్రపంచ రికార్డు స్థాపించారట

* * *

అమెరికాలో ఇద్దరు కుర్రాళ్లు 52 గంటల 4 నిముషాల సేపు బాస్కెట్‌బాల్ ఆడి ప్రపంచరికార్డు స్థాపించారట

విసురుగా చెయ్యి కడుగుకు లేచిపోయిన ఆదిత్యని చూస్తూ, స్థాణువడిపోయారు హేమంత, ధనలక్ష్మి

''చూశావా వాడి విసురు ? ఆడదానివై వుండి నీకే పట్టలేదు నా బాధ ! ఇహ వాడికేం పడుతుంది ? వెళ్లు — వెళ్లిపో !

వాడలాగే పిచ్చివాడైపోతాడు ! నే నిలాగే రాలిపోతాను !

ఎవరి రాతని ఎవరు తప్పిస్తారు ?''

టేబిల్ ముందునుంచి లేచిపోయింది ధనలక్ష్మి కూడా ఆలోచనల్లో, కళ్లనీళ్లు నింపుకు, అలాగే కూర్చుండిపోయింది హేమంత

* * *

''సాయంత్రం కొంచెం షాపింగ్ పని వుంది త్వరగా రాగలవా మామయ్యా !'' మన్నాడు ఆదిత్య హాస్పిటల్‌కు వెళ్లటానికి తయారవుతుండగా అడిగింది హేమంత

''అలాగే !'' ఉత్సాహంగా అన్నాడు ఆదిత్య ఆమె ఆ రాత్రే వెళ్లిపోతుంది మరి !

సాయంత్రం షాపింగ్ కాగానే ఇద్దరూ కలిసి బీచ్‌కి వెళ్లారు మనుషులకి దూరంగా, సముద్రానికి దగ్గరగా నడిచారు

కాసేపు మౌనంగా దొర్లిపోయాక, అలలకేసే చూస్తూ, నెమ్మదిగా ప్రారంభించింది హేమంత

''మామయ్యా, ఒకటడగమంటావా ?''

''అడుగు హేమంతా !'' అన్నాడు ఆదిత్య

''నువ్వు నువు పెళ్లెందుకు చేసుకోవు ?''

బెదురుగానే అడిగింది

''హేమంతా '' సీరియస్‌గా మారిపోయాడు ఆదిత్య, ''ఆ విషయం అడగవద్దనలేదూ ?''

''ఎందుకు మామయ్యా ? నువ్వేం వివాహ వయస్సు రాని పసివాడివా, వయసు మళ్ళిపోయిన ముదివగ్గువా ? ఎందుకు అడగకూడదు ?

కారణం వున్నవాడు ఏ పని చేసినా, ఎవరైనా సమర్థిస్తారు కానీ, అకారణంగా మొండికెత్తి, నువ్వు నీ చుట్టుప్రక్కల వాళ్లని, నీమీద ఆశల బ్రతుకుతున్నవాళ్లని కూడా బాధలపాలు చేస్తున్నావ్ !

అమ్మమ్మని ఒక్కసారి మనసు విప్పి చూడు !

ఆ ముసలిప్రాణం నీకోసం ఎంతగా పరితపిస్తుందో, నీ వరస చూసి ఎలా కృశించిపోతోందో, మనిషిగా కాకపోయినా, ఒక డాక్టర్‌గానైనా చూడు !

నీ బాధ చూడనూలేక, అర్థమూ కాక సతమతమైపోతోంది ! యింతగా నీకోసం బాధపడే ఆమెతో కనీసం నీ వ్యథను పంచుకోనైనాకూడదా ?

వ్యథిత హృదయం సానుభూతి కోరుతుందంటారే — కన్నతల్లికూడా నీ బాధ పంచుకోతగదా ?

కన్నతల్లిగా ఆమెవద్ద భయమో, జంకో వుంటే, చిన్ననాటినించీ, మేనగోడలికన్న ఎక్కువ— స్నేహితురాలినే ! నాతో చెప్పుకోటానికేం అభ్యంతరం ?

ఊరందరికీ చెప్పి నవ్వులపాలు చేస్తామా ? మూర్ఖంగా ప్రవర్తించి నీ బ్రతుకు నరకం చేస్తామా ?

మామయ్యా ! సాటి మనిషిని — ఆత్మీయుల్ని నమ్మలేనివాడు తనని తానుకూడా నమ్మలేని స్థితికి రావటానికెంతో కాలం పట్టబోదు !

ఆత్మవిశ్వాసాన్నే కోల్పోయి — తనకి తాను భయపడే స్థితికి చేరుకోవటంకన్న చరమ దౌర్భాగ్యం మనిషికి మరోటి వుండదని నీకూ తెలుసు !''

సమాధానం ఆశించినట్లుగా, సీరియస్‌గా అలలవైపే చూస్తూ, గంభీరంగా కూర్చుండిపోయింది హేమంత

''ఎందుకు హేమా, నన్నిలా వేధించిచంపుతావు ? ఏమీ లేదన్నానుగా !'' బాధగా అన్నాడు ఆదిత్య

''వేధించి చంపాలనికాదు మామయ్యా, వేదన పంచుకోవాలని మాత్రమే !

అహోరాత్రాలూ తిండీ, నిద్రా మాని నువ్వు పడుతున్న బాధ మాది కాదా ?

ఏమీ లేదంటే ఎలా నమ్మను ?

మొన్న జ్వరంలో నువ్వు కలవరించిన 'శమంత' పేరులోనూ ఏమీ లేదా ?

అసలేం జరిగిందో చెప్పు మామయ్యా !''

లాలనగా అడిగింది హేమంత అన్నీ తెలిసినా, అతడిచేత చెప్పించనిదే, తను ప్రస్తావించి, అతడిలోని వైరాగ్యాన్ని తరమటం కుదరదు

శమంత పేరు వినటంతోనే, ఉలిక్కిపడ్డాడు ఆదిత్య

"నేను కలవరించావా ?" కంగారుగా అడిగాడు

"అవును మామయ్యా! నువ్వు నువ్వా మెను ప్రేమించావా ?" అతి ప్రయత్నంమీద అడిగింది

"ప్రేమించటంకాదు హేమా పెళ్లి చేసుకున్నాం " ఎటో చూస్తూ అన్నాడు ఆదిత్య

హేమంత హృదయం ఉప్పొంగింది—మామయ్య ఇన్నాళ్లకి — జవాబు చెప్పాడు!

"పెళ్లి పెళ్లి చేసుకున్నావా ? మరి, అమ్మమ్మకూ తెలియదా ?" ఎరగనట్లే అడిగింది

"పెద్దల సమక్షంలో, తనువులకు జరిగే తంతునే పెళ్లిగా పరిగణిస్తే నేనేం చెప్పలేనుగానీ, నిండుగా ప్రేమించుకున్న రెండు హృదయాలు — పరస్పర రాగరంజితాలై — ఒకటిగా కలిసి బ్రతకటానికి నిశ్చయించుకోవటంకన్న మించిన పవిత్ర వివాహం మరొకటి లేదని నేను మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను హేమా! అలాటి వివాహమే మాకూ జరిగింది!"

"మరి మరి ఆమెనెందుకు యింటికి తీసుకురావు ? అమ్మమ్మ తిడుతుందనేనా ?" హృదయాన్ని పాషాణంగా చేసుకు, తప్పనిసరిగా ప్రశ్నించింది హేమంత

"అంత అదృష్టం నాకు లేకపోయింది హేమా! అదే అదే నాబాధ!"

నిండుగా వరద వచ్చిన నదిలా పారుతున్న వ్యధ, హేమంత చేసిన 'గండి'తో ఒక్కవుదుటున బయటకు దూకింది!

కథంతా అతడి ముఖత విన్న హేమ కళ్లలో మళ్లీ నీళ్లుతిరిగాయి

"ఎంత వ్యధని నీలో దాచుకున్నావు మామయ్యా! యింత విషాదాన్ని ఎలా భరిస్తున్నావు ఎవరితోనూ పంచుకోకుండా!"

రుద్ధ కంఠంతో అంది

"ఎవరితో పంచుకున్నా పోయిన శమంత తిరిగిరానప్పుడు, అందరికీ బాధను పంచటం అనవసరంకాదా హేమా ?"

"కానేకాదు మామయ్యా! సుఖాల్లోనేకాదు— దుఃఖాల్లోనూ, కష్టాల్లోనూ కూడా మనిషికి మనిషి తోడు అవసరమే!

పోయిన శమంతను మరవాలంటే, నీకు యితర వ్యక్తుల తోడ్పాటు, యితర వ్యాపకాల "

"హేమా " గట్టిగా అన్నాడు ఆదిత్య, "ఆ మాట మాత్రం కలలోకూడా అనకు శమంతను మరవటం ఈ జన్మకు జరగని విషయం!

నేను ఆమె మనసుని ప్రేమించాను హేమా, మనిషిని కాదు లేకుండా పోయింది మనిషేగానీ, మనసు కాదు అదెప్పుడూ నాతోనే వుంటుంది నే నెప్పుడూ జంటగానే బ్రతుకుతాను

మళ్లీ మరో వివాహం చేసుకోవటం, మరో మనిషితో ముడి వేసుకోవటం — మనసున్న మనిషిగా నేను చేయలేని పని!"

[ఇంకా వుంది]




''అన్నదమ్ముల అనుబంధం''లో
జయమాలిని, బాలకృష్ణ

## అన్నదమ్ముల అనుబంధం

హిందీలో విజయఢంకా మ్రోగించిన ''యాదోంకీ బారాత్'' చిత్రాన్ని గజలక్ష్మి చిత్ర ''అన్నదమ్ముల అనుబంధం'' పేరిట తెలుగులో భారీయెత్తున నిర్మిస్తున్నారు.

ప్రజా నటుడు ఎన్టీరామారావు ప్రజలుమెచ్చే అపురూపమైన పాత్రను ''నభూతో నభవిష్యతి''గా పోషిస్తున్నారు. ఆయనకు తమ్ములుగా మురళీ మోహన్, బాలకృష్ణ నటిస్తున్నారు.

''నిప్పులాంటి మనిషి'' తెచ్చిన పేరు, ప్రతిష్ఠలను ''అన్నదమ్ముల అనుబంధం'' చిత్రం యినుమడింప చేసి దర్శకుడు లాల్ అంతస్తును పెంచగలదనడంలో సంశయ మవసరంలేదు.



# సినిమా విశేషాలు

## అభిమానుల ఆగ్రహం

గత వారం విజయవాడ వెళ్లాను. ''మాయా మశ్చీంద్ర'' ప్రదర్శింపబడుతున్న థియేటర్ దగ్గర నిలబడ్డాను. సినిమా చూచి వచ్చిన జనం ఏమను కొంటున్నారో విన్నాను. ''నటరత్న'' ఎందుకీ పాత్రను పోషించాలి? ఆంధ్రుల అభిమాన మహా నటుడు రామారావుగారిని, యింత తక్కువ వేషంలో చూపించినందుకు తమ ఆగ్రహాన్ని వ్యక్తపరచారు. ఇలాంటి పాత్రను ఆయన యికపై అంగీకరించరాదు అన్నదే వాళ్ల బాధ.

## అభిమానుల కోర్కె

ప్రేక్షకుల అభిమాన ధనాన్ని ఎక్కువగా ఆర్జించిన నటి ఎవరంటె — వాణిశ్రీ పేరు వినిపిస్తుంది.

ఈమధ్య ఆవిడకు విచిత్రమైన ఉత్తరాలు వస్తున్నాయి. నలభై దాటిన వనితలు వాణిశ్రీని సీతగా, ద్రౌపదిగా చూడాలన్న కోర్కెను వ్యక్త పరుస్తున్నారు. వాణిశ్రీకి కూడా ద్రౌపది పాత్ర పట్ల, సీత భూమికపట్ల మోజు లేకపోలేదు.

జనవరి నుంచి యిప్పటివరకు విడుదలైన చిత్రాలను సమీక్షిస్తే, నాల్గింటికే మాత్రమే ప్రజాదరణ లభించిందన్న నిజం తెలిసింది. వారానికి సగటున రెండు చిత్రాల చొప్పున విడుదలగావడం అనివార్యమవుతున్నదేగాని, ప్రేక్షకులను ఆకర్షించ గల శక్తిని కొన్నిమాత్రమే పొందియుండడంవల్ల, నిర్మాతల పెట్టుబడులకే యిబ్బంది ఏర్పడుతున్నది.

అమోఘ ప్రేక్షకాదరణ పొందిన చిత్రాలు నాల్గు అని పేర్కొన్నాను. అవి ఏవన. ''యశోదా కృష్ణ, జీవన జ్యోతి, దేవుడు చేసిన పెళ్లి, శ్రీరామాంజనేయ యుద్ధం.'' (ఇవన్నీ కలర్ చిత్రాలు.) నలుపు—తెలుపు చిత్రాలలో ''పుట్టింటి గౌరవం, కొత్తకాపురం'' ధనలాభాన్ని తెచ్చి పెట్టాయి.

ప్రేక్షకులు మంచేదో, చెడేదో నిర్ణయించ గల స్తోమతను బడసియున్నారు గాబట్టి, మోసం చెయ్యడం కుదరని పనిగా పరిణమించింది. రాబోయే రోజుల్లో చిత్ర పరిశ్రమకు పెద్ద దెబ్బతగలడం తథ్యమనిపిస్తుంది.

## ''నాగపూజా మహిమ''

నాగుపామును నమ్ముకున్నవారికి ఎలాంటి ఆపదలు రావు, వచ్చినా అడుగడుగునా కంటికి రెప్పలా కాపాడుతుంది, అపదలనుంచి తప్పిస్తుంది నాగుపాము అనే అంశంపై తీయబడిన చిత్రమే ''నాగపూజా మహిమ''. ఆనంద సినీ ఎంటర్ ప్రైజస్ నిర్మించే ఈ చిత్రం విడుదలకు సిద్ధమైంది — కె. జోసెఫ్‌రెడ్డి ఈ చిత్రానికి నిర్మాత.

## కృష్ణంరాజు కొత్త ప్రయత్నం

ఒక నెల రోజులపాటు కాశ్మీరులో విశ్రాంతి తీసుకుని, మే నెల యిరవై అయిదున మదరాసుకు వచ్చారు, హీరో కృష్ణంరాజు.

ప్రజలలో హీరో గ్రిప్ వున్న అయిదుగురిలో కృష్ణంరాజు ఒకరు. మిగతా నలుగురు ఎవరన శ్రీయుతులు నాగేశ్వరరావు, రామారావు, శోభన్ బాబు, కృష్ణగార్లు.

గత ఏడు ''కృష్ణవేణి'' వంటి విలువైన చిత్రాన్ని అందించిన కృష్ణంరాజు యీ ఏడు మరొక మాణిక్యాన్ని అందివ్వబోతున్నారు.

గోపీకృష్ణ మూవీస్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించబోయే ''భక్త కన్నప్ప'' చిత్రాన్ని కని, విని,



''రక్త సంబంధాలు''లో మంజుల, కృష్ణ

పల్లవి యింటర్నేషనల్‌వారి ''ఇద్దరూ యిద్దరే'' చిత్రంలో తను, శోభన్ నటిస్తున్న నిజాన్ని తెలిపారు.

## ''ఆస్తి కోసం''

పృధ్వీరాజ్, వేగి వీర్రాజు నిర్మిస్తున్న ''ఆస్తి కోసం'' చిత్రం మెరుగులు దిద్దుకుంటూ ముస్తాబవుతుంది. ఆస్తికోసం ఎలాంటి ఘోరాలు జరుగుతాయి, ఎందరు ఎన్ని విధాలుగా బాధపడతారు అనే నైజాన్ని మకుటమే తెలియచేస్తోంది. సంక్షోభాల సంద్రంలో ఆధారంలేని ఓడల్లా కొట్టుకుపోతాయి మూడు పాత్రలు పై చిత్రంలో. అవి ఏవన :

పార్వతమ్మ : చెయ్యని నేరానికి భర్త బలై పోగా, కన్న యిద్దరు కొడుకుల్లో ఒకరు వేరై పోగా, పెద్దకొడుకుతో బ్రతుకులో రాజీపడ్డ స్త్రీమూర్తి.



"నాడు–నేడు"లో హలం, (గీత) ప్రసాద్

"అన్నదమ్ముల అనుబంధం" చిత్రానికి గొల్లపూడి, చక్రవర్తి, బి. ఎస్. కృష్ణ, శేఖర్ — సింగ్, కృష్ణకిశోర్ రెడ్డి సాంకేతిక శాఖలకు ఆధిపత్యం వహిస్తున్నారుగాబట్టి, రిజల్టు బాగా వుండగలదు.

ఈ చిత్రంలోని ముఖ్య పాత్రలను లత, కాంచన, జయమాలిని, ప్రభాకరరెడ్డి, గిరిబాబు, త్యాగరాజు, రావి కొండలరావు, మరియు రాజబాబు పోషిస్తున్నారు.

ప్రజాకర్షణను పొందగల "అన్నదమ్ముల అనుబంధం" చిత్రం గజలక్ష్మి అధినేతకు ధనలక్ష్మిని తెచ్చిపెట్టగలదు.



"వైకుంఠపాళి"లో శారద, రంగనాథ్

## రాజ్యం పిక్చర్స్!

"నర్తనశాల" వంటి అసమాన పౌరాణిక చిత్రాన్ని నిర్మించిన శ్రీధరరావు, లక్ష్మీరాజ్యం గార్లు "ద్రౌపది"ని ఈస్ట్‌మన్ కలర్‌లో తలపెట్టారు.

"ద్రౌపది" పాత్రను ఆంధ్రుల అగ్రనటి పోషించడానికి, కృష్ణుడుగా భారతీయుల పురాణ నటుడు రామారావు ధరించడానికి అంగీకరించారు. సుయోధన సార్వభౌముడుగా సత్యనారాయణ నటించగలరు. ఈ చిత్రానికి ఆదినారాయణరావు, కమలాకర కామేశ్వరరావు, సముద్రాల ముఖ్య సాంకేతికవర్గం.

## శివాజీవలె నటించగలరా?

ఈమధ్య ఒక మంచి చిత్రాన్ని చూశాను. అది డబ్బింగ్ చిత్రమే అయినా, యివ్వాడొస్తున్న స్ట్రెయిట్ చిత్రాలకంటె ఎంతో మెరుగు అనిపించింది. చిత్రం పేరు "పెద్దమనిషి." నిర్మాత పేరు ఎం. ఏ. రెడ్డి.

ఈ చిత్రంలో శివాజీగణేశన్ నటనే గూర్చి రాయాలంటె ... నాలుగుపదాలు తప్పక వాడాలి. "అద్భుతం ... అద్వితీయం ... అసమానం ... అసాధారణం."

ఒక కథను దర్శకుడు చక్కగా చిత్రించగలిగితే, అది ఎంత గొప్పగా వస్తుందో "పెద్దమనిషి" తెలియచేస్తుంది.

శివాజీ గంభీర నటనకు, జగ్గయ్య కంఠం పెద్ద యస్సెట్ అనే చెప్పాలి. సహాయ పాత్రలను శారద, విజయనిర్మల పోషించారు.

"పెద్దమనిషి" చిత్రానికి, రాజశ్రీ రచన, సత్యం సంగీతం బాగా సహకరించాయి. మాధవన్ దర్శకత్వం నిర్వహించిన యీ చిత్రం పెద్ద మొత్తాన్ని ఆర్జించగలదు.

ఎరిగిన రీతిలో వుండేట్లు ... ప్రజలు తీర్పు నిచ్చేట్టు ఏర్పాట్లు చేస్తున్నారు, కృష్ణంరాజు.

"భక్త కన్నప్ప" చిత్రానికి విక్టరీ మధుసూదనరావు దర్శకుడుగా, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయాగ్రహణ దర్శకుడుగా, సత్యానంద్ రచనా దర్శకుడుగా, ఆదినారాయణరావు — సత్యం సంగీత సారథులుగా వుండగలరని, నిర్మాత సూర్యనారాయణ రాజు (కృష్ణంరాజు సోదరుడు) చెప్పారు.

ప్రధాన పాత్రలను కృష్ణంరాజు, వాణిశ్రీ, రాజబాబు పోషించగలరు. చిత్రం షూటింగు అక్టోబరు నుంచి వుండగలదు. ఈ చిత్రంలో డ్రమ్ డ్యాన్స్ ప్రత్యేక ఆకర్షణగా వుండగలదు.

మీరు ఎక్కువ చిత్రాలను అంగీకరించకపోవడానికి గల కారణం ఏమిటి? అని కృష్ణంరాజును అడిగాను. పాత్రలు నచ్చక వద్దు అనడం తప్ప మరో కారణం ఏమీ లేదన్నారాయన.

మీరేదో డబ్బు ఎక్కువ అడుగుతున్నారట నిజమేనా? అని ప్రశ్నించాను. అలా చెప్పినవాళ్లనే అడగండి. క్యారెక్టర్ మంచిదవ్వాలేగాని, డబ్బు దేముంది అని ఆయన సమాధానం యిచ్చారు.

వేషం మంచిదైనప్పుడు, ఒకే చిత్రంలో యిద్దరు హీరోలు చెయ్యడం తప్పుకాదని చెప్పి, చేసిన నేరం తనపై ఆరోపించబడగా, ప్రేమించిన మామకూతురు సంశయించగా, తన నిజాయితీని, నిరూపించుకోవడానికి ఎన్నో అవాంతరాలనెదుర్కొన్న సాహసి.

వేణూ : పార్వతమ్మ కనిష్ఠపుత్రుడు. కన్నతల్లికి, అన్నకు దూరంగా పెరిగి, పోలీస్ ఆఫీసరై, తన స్వంత అన్నయ్యనే ఖైదు చేయడానికి సంసిద్ధుడైన నిష్పక్షపాతి.

పై మూడు పాత్రల మధ్య విభిన్న మలుపులతో రూపొందింపబడుతున్న చిత్రమే దాసరి సత్యనారాయణమూర్తి సమర్పించే "ఆస్తికోసం".

పినిశెట్టి కథను, దాసం గోపాలకృష్ణ మాటలను, యస్. హనుమంతరావు సంగీతాన్ని, కె. యస్. మణి ఛాయను, బాలు ఎడిటింగ్‌ను, భాస్కరరాజు కళను, సమకూర్చిన ఈ చిత్రంలో రామకృష్ణ, ప్రమీల, పండరీబాయి, అల్లు రామలింగయ్య, త్యాగరాజు, రాజనాల, రావు గోపాలరావు, కె. వి. చలం, కాకరాల, బాలకృష్ణ, కోళ్ల సత్యం, కె. కె. శర్మ, భీమరాజు, గిరిజారాణి, సుశీల, మనోరంజిని, జయమాలిని ముఖ్య పాత్రధారులు. గిడుతూరి సూర్యం దర్శకత్వంలో చకచక సాగుతోంది చిత్రం వర్క్.



"ఆస్తికోసం"లో రామకృష్ణ, ప్రమీల

## సినిమా

### పి. ఎ. పి. చిత్రం ఎప్పుడు ?

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ నిర్మించే కొత్త చిత్రం షూటింగు జూన్‌లో ఆరంభం అవుతుందని, రామకృష్ణ — లక్ష్మి ప్రధాన పాత్రలను పోషిస్తున్నారని, తాతినేని రామారావు డైరెక్ట్ చేస్తున్నారని రెండువారాల క్రితం రాశాను.

షూటింగు తేదీ సమీపించిందిగదా అని నిర్మాత ఏ. వి. సుబ్బారావుగారిని కలిశాను. పూర్తి వివరాలు చెప్పగలరా అని ప్రశ్నించాను.

షూటింగు వాయిదా పడినట్లు పాఠకులకు తెల్పమని ఆయన అన్నారు. "తీయదలచిన చిత్రం అనుకున్నవిధంగా రానికారణంగా, ఆ కధను వద్దను కొన్నట్లు, కొత్త కధను అన్వేషిస్తున్నట్లు, ఆగస్టు నుంచి షూటింగు ఆరంభం కావచ్చు", అని వివరించారు.

1976 లో "నటసామ్రాట్" నాగేశ్వరరావు గారితో ఈస్ట్‌మన్ కలర్ చిత్రం నిర్మించబోతు న్నట్టు, పి. ఎ. పి. అధినేత చెప్పారు.

### అక్కినేనితో శోభానాయుడు

"నటసామ్రాట్" నాగేశ్వరరావు క్షేత్రయ్య పాత్రను పోషించ, అతగాడిని వలచి, మనసును దోచుకున్న నర్తకిగా విఖ్యాత నాట్యమయూరి శోభానాయుడు నటించగలదన్న విజ్ఞాన్ని, ఆ చిత్రంలో రంగాజమ్మ పాత్రను పోషిస్తున్న అంజలీదేవి వెల్లడి చేసింది.

"మహాకవి క్షేత్రయ్య" వర్ణచిత్రం షూటింగు జూలై 18 నుంచి బెంగుళూరు చాముండేశ్వరి స్టుడియోలో ప్రారంభం అవుతుందని, నిర్మాత ఆదినారాయణరావు చెప్పారు.

లోగడ సారధి స్టుడియోలో "క్షేత్రయ్య" షూటింగు జరగగలదని రాశాను. అనివార్య కారణాల ప్రతిఫలంగా స్టుడియో మార్పు సంభవించింది.

"క్షేత్రయ్య"ను ఒక అద్వితీయ కళాఖండంగా రూపొందించాలన్న తపన విక్టరీకి, ఆరుద్రకు, అక్కినేనికి, ఆదినారాయణరావుకు వున్నది. విజయీభవ !

### ఏమిటీ వైపరీత్యం ?

తప్పు చేసేది ఒకరు. శిక్ష ననుభవించేది మరొకరు. మగవాడు తప్పు చేసినా ఏదో విధంగా మాసిపోతుంది ఆ మచ్చ. కానీ అదే మగువ, అన్యాయంగా, అక్రమంగా, బలాత్కారంగా కళంకినిగా చేయబడినా, ఆవిడనే వేలెత్తి చూపిస్తుంది ఈ లోకం. ఇదెక్కడి న్యాయం ? ఇది సమంజసమా ? అని ప్రశ్నిస్తే, సమాధానం ఇచ్చేందుకు ఎవ్వరూ కన్పించరు. అలాంటి స్త్రీల జీవితాల్లో మళ్లీ వసంతం చిగురించాలంటే మరికొన్ని జీవితాలు వాడిపోవాల్సిందే.

అలా రాక్షసుల కామదాహానికి బలైపోయిన వారిలో మాధవి, దుర్గల పేర్లు కూడా వున్నాయి. విపరీత పరిస్థితుల్లో కామాంధుల కబంధహస్తాల్లో నలిగిపోయి, బ్రతుకులు చాలించాలనుకుంటారు ఇద్దరూ. కానీ దైవనిర్ణయం వేరేగా వుండడం వల్ల, వేరు, వేరు, విధాలుగా జీవితాల్ని కొనసాగిస్తారు ఆ ఇద్దరు స్త్రీలు. వారి చుట్టూ పరిభ్రమించే కథే కృషీవలా ఫిలింస్ (ప్రై) లిమిటెడ్‌వారి "వయసొచ్చిన పిల్ల" చిత్రం. టెంపో కథాగమనం చాలా చక్కగా సాగింది చిత్రంలో. తర్వాత ఏం జరుగుతుందా అనే ఆతృతను కలిగించే విధంగా చిత్రాన్ని డైరెక్ట్ చేస్తున్నారు లక్ష్మీదీపక్.

లక్ష్మి, చంద్రకళ, జి. వరలక్ష్మి, నిర్మల, కె. విజయ, సుశీల, శోభ, బాలసరస్వతి, అపర్ణ, బేబీరోహిణి, గిరిబాబు, మురళీమోహన్, శరత్‌బాబు, యం. రంగారావు, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, పద్మనాభం, త్యాగరాజు, పొట్టి ప్రసాద్, మాడా, పవన్‌కుమార్, కె. కె. శర్మ, డా. శివరామకృష్ణయ్య, వల్లం నరసింహారావ్, శ్యాంబాబు, వీరభద్రరావు, కాకరాల, పి. జె. శర్మ, కాశీనాథ్ తాతా, రాఘవేంద్రరావు ముఖ్య పాత్రధారులైన ఈ చిత్రానికి టి. చలపతిరావు సంగీతాన్ని, శేఖర్, సింగ్ ఛాయను, జి. వి. సుబ్బారావు కథను, జె. కృష్ణస్వామి కూర్పును సమకూరుస్తున్నారు. రెడ్డి వెంకటరెడ్డి సమర్పిస్తూ, పి. వి. సుబ్బారావు (నవభారత్) నేతృత్వం వహిస్తున్న ఈ చిత్రానికి కె. మురహరిరావు, పి. రామిరెడ్డి నిర్మాతలు.



"వయసొచ్చిన పిల్ల"లో గిరిబాబు, లక్ష్మి

### కళాసాగర్‌కు బహుమతి

చెన్నపురిలో ఎన్నెన్నో వైజ్ఞానిక సంస్థలు వెలసిన విషయం వాస్తవమే అయినా, విశిష్టత వున్న సంస్థగా "కళాసాగర్" ప్రజాభిమానాన్ని ఆర్జించగలిగింది.

"కళాసాగర్"ను ఉత్తమ వైజ్ఞానిక సంస్థగా నిర్ణయించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మెమెంటోను బహూకరించింది. ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ మంత్రి మండలి కృష్ణారావుగారిచ్చిన అవార్డును, కళాసాగర్ అధ్యక్షుడు డాక్టర్ ముద్దు కృష్ణారెడ్డి అందు కొన్నారు. ఈ సంస్థ బలపడటానికి ముద్దు కృష్ణారెడ్డి, ఏ. వి. కె. శాస్త్రి, సుభాన్, వంటి ఉత్సాహవంతులు వొనరిస్తున్న కృషిని అభినందించాలి.

### జానకి గంధర్వగానం

"నైటింగేల్ ఆఫ్ ది సౌత్" అని జానకిని అనడంలో ఎవ్వరికీ ఆక్షేపణ వుండదు. అలా ఎవరికైనా వుండివుంటె, ఆమె మే 18న అశోకా హోటల్ ఆవరణలో జరిపిన గాన కచ్చేరి నివర్తి చేసి వుండాలి. "కళాసాగర్" ఆధ్వర్యంలో జరిగిన పై పాట కచ్చేరి మూడు గంటలసేపు శ్రోతలను పరవశింపచేసింది. ఆమెతో పాడిన బాలకృష్ణకు భవిష్యత్తు వున్నది.

### "అగ్నిపరీక్ష"

విఖ్యాత రచయిత్రి మాదిరెడ్డి సులోచన రచించిన అపూర్వమైన నవల "అగ్నిపరీక్ష"కు చలన చిత్ర రూపాన్ని యిచ్చే హక్కును నవభారత్ బుక్ హవుస్ అధినేత పి. ఎస్. ప్రకాశరావు పొంది యున్నారు. ఈ నవల యొక్క నాయిక పాత్రను "సూపర్ స్టార్" మాత్రమే పోషించగలరు.

"సంసారం"లో రోజారమణి, చిట్టిబాబు



## "నేటి కథ"

ప్రముఖ రచయిత్రి సి. ఆనందరామం రాసిన ''నేటి కథ'' నవలను చలన చిత్రంగా నిర్మించే హక్కును డాల్ఫిన్ పిక్చర్స్ అధినేత గుళ్లపల్లి నాగేశ్వరరావు పొందియున్న నిజాన్ని ఆయన ద్వారా విన్నాను.

ఈ నవల చదివితె, కథానాయిక పాత్రను పోషించగల ప్రతిభ ''కావ్య నాయిక''కు మాత్రమే గలదనిపిస్తుంది.

''జీవిత రంగం'' చిత్రం నిర్మించినప్పుడె, ఆమె చేత హీరోయిన్ వేయిద్దామనుకొన్నారు. ''నేటి కథ''కు ఆమె ఒక్కతె సరితూగగలదు.

## మేడపైకెక్కిన కారు !

జగపతి రాజేంద్రప్రసాద్ తన స్టాఫ్‌కోసం నిర్మిస్తున్న "పిచ్చిమారాజు" వర్ణ చిత్రం షూటింగు వాహినిలో (ఇన్‌డోర్) జరిగింది.

నే వెళ్లిన ఆరోజున ఒక విచిత్ర సంఘటన జరిగింది. నేలమంచి మేడపైకి కారు సునాయాసంగా పయనించింది. ఎంతో రిస్కుతో కూడిన ఆ ''ఫీట్''ను చూచిన ప్రతి ప్రేక్షకుడు అబ్బో...అబ్బో అనకమానడు.

జగపతి సంస్థ అందించే చిత్రాలలో ఏదేని ''థ్రిల్'' వుంటుందని ప్రేక్షకులు ఎదురు చూస్తారు. ప్రజలు ఆశించేదానికి వందరెట్లు ఎక్కువ ''థ్రిల్'' వుండేట్లు, రాజేంద్రప్రసాద్ ప్రయత్నిస్తారు.

''పిచ్చిమారాజు'' చిత్రంలో శోభన్, మంజుల, రాజబాబు, అంజలీదేవి, ఎస్వరలక్ష్మి, అల్లురామలింగయ్య, రావుగోపాలరావు, ధూళిపాళ ప్రధాన తారాగణం.

సాంకేతిక శాఖలను రాజేంద్రప్రసాద్, వెంకటరత్నం, మహదేవన్, కృష్ణారావు, సంజీవిలాంటి అనుభవజ్ఞులు నిర్వహించ, రిజల్టు అద్భుతంగా వుండకపోతుందా ?

## "సంపూర్ణ శివ పురాణం"

లక్ష్మీప్రకాష్ ప్రొడక్షన్స్ అనే చిత్ర నిర్మాణ సంస్థ, రాజమండ్రి అప్సర థియేటరు అధినేత అత్యం సోమేశ్వరరావు సమర్పణలో ''సంపూర్ణ శివ పురాణం'' అనే మహోజ్వల పౌరాణిక చిత్రాన్ని నిర్మిస్తోంది. బ్రహ్మ, విష్ణువుల యుద్ధము, దక్ష యజ్ఞము, గంగావతరణము, రతీ మన్మధుల (శృంగార) నాట్యము మహిషాసురమర్దనము, మున్నగు పెక్కు ఆసక్తికరమైన ఘట్టాలను జొప్పించారు పై చిత్రంలో. 101 ట్రిక్ సీనులతో ఈస్ట్‌మన్ కలర్‌లో భారీ ఎత్తున నిర్మింపబడిన ఈ చిత్రం ఆబాలగోపాలం చూచి ఆనందింపదగిన చిత్రం. ఈ చిత్రానికి వి. శకుంతల నిర్మాత.



''చీకటి వెలుగులు''లో ఒక దృశ్యం

## గిరిబాబు జాతకమ్

''జగమే మాయ'' చిత్రం ఆర్థికంగా దెబ్బతిన్న మాట వాస్తవమే అయినా, ముగ్గురికి మహర్జాతకాన్ని ప్రసాదించింది. ఆ ముగ్గురు ఎవరన. గిరిబాబు; మురళీమోహన్; కె. విజయ.

దుష్టనాయకుడి పాత్రకు సరైన నటుడు దొరికాడు అన్నారు, గిరిబాబు ప్రవేశంతో. అతడు దుష్టుడిగానే గాక, మంచివాడుగా కూడా రాణించ గల నటనా ప్రతిభను పొందియున్నాడు గాబట్టే, కొందరు హీరోగా పెట్టుకొంటున్నారు.

ఈమధ్య గిరిబాబును మల్లికార్జునరావుగారి



''వనజ–గిరిజ''లో రమాప్రభ

''రక్తసంబంధాలు'' సెట్లో కలిశాను. పోలీస్ ఆఫీసర్ గెటప్‌లో హుందాగా, ఠీవిగా వున్నాడు. ఏ పాత్రకైనా సరిపడే పర్సనాలిటీ వున్నదాతడికి.

ప్రస్తుతం తను నటిస్తున్న చిత్రాలలో వెరైటీ వేషాలను వేస్తున్నట్టు చెప్పాడు.

''వయసొచ్చినపిల్ల; ఇల్లు – వాకిలి; రక్త సంబంధాలు; మనసాక్షి; ఆస్తికోసం; స్వామి ద్రోహులు; వెలుగుబాటలు; అన్నదమ్ముల అనుబంధం; రాము – సోము; చక్రపాణి ఆర్ట్స్; శ్రీ నందినీ ఫిలింస్; మురళీకృష్ణా మూవీస్; పొగ్గాడు; ఆర్. కె. ఆర్ట్స్; ఊర్వశి మూవీస్'' చిత్రాలలో వైవిధ్యం వున్న వేషధారణ చేస్తున్న గిరిబాబుకు యిక తిరుగులేదు.

## రాజబాబు పబ్లిక్ ట్రస్ట్

విఖ్యాత విదూషక నటుడు రాజబాబు తను ఆర్జించే విత్తంలో కొంత భాగాన్ని ప్రజోపయోగ కార్యాలకు వినియోగించదలచాడు.

''రాజబాబు పబ్లిక్ ట్రస్ట్''ను ఏర్పరచాడు. మే ఆరున ప్రముఖ నటి అంజలీదేవి యిచ్చిన చెక్కుతో ''పబ్లిక్ ట్రస్ట్ ఫండ్'' ఆరంభమైనట్టు రాజబాబు చెప్పారు.

''కోరుకొండ జూనియర్ కళాశాలకు 25,000 యివ్వదలచినట్టు, రాజమండ్రి స్కావెంజర్స్ కాలనీకి 30,000 యివ్వనున్నట్టు, రాజమండ్రిలో ఆడిటోరియమ్ నిర్మాణానికి లక్ష కేటాయించినట్టు'', రాజబాబు తన కార్యక్రమాన్ని వెల్లడించారు.

తనపై ప్రేమాభిమానాలు వున్న వ్యక్తులు, మిత్రులు, నిర్మాతలు, నటీనటులు ''రాజబాబు పబ్లిక్ ట్రస్ట్'' పేరిట క్రాస్‌డ్ చెక్కును ఆంధ్రా బ్యాంకు, మదరాసు – 17కు పంపవలసినదిగా, పత్రికా ముఖంగా తెలుపుతున్నాడు, మీ రాజబాబు.

— శ్రీనివాస్

# చేదునిజం

టి.వి.ఎల్. హేమలతాదేవి



***సాయంకాలం నుంచీ మబ్బులు కమ్మిన ఆకాశం, చీకటిపడగానే చిన్న చిన్న తుంపరలతో ప్రారంభమై కుండపోతగా వర్షం కురుస్తున్నది***

కిటికీలోనుంచీ లోపలికి జల్లు కొడుతున్నది జల్లుతోపాటు చలిగాలి రివ్వున వీస్తున్నది

అయినా, నా ఖర్మ కాకపోతే యింట్లో కాసిని కాఫీనీళ్లు పెట్టే దిక్కయినా లేదుకదా! పోనీ, నేనే లేచి స్టవ్ వెలిగించి కాఫీనీళ్ళు పడేద్దామన్నా చలికి కదలబుద్ధి కావటంలేదు

జల్లు మీదపడటంతో తప్పనిసరిగా లేచి, కిటికీ తలుపు మూశాను తలుపులన్నీ వేసుకున్నా చలి తగ్గలేదు

అసలే సాయంత్రం జరిగిన సంఘటనకు చికాగ్గా వున్న నాకీ వాతావరణం మనసులోని బాధకు మరింత తోడయింది

అసలు రాణితో పరిచయం కాకుండా వుంటే బాగుండేదేమో? నాకీ వ్యధ తప్పేది

జరిగిన సంఘటనలన్నీ ఒక్కసారి మనసులో మెదిలినాయి నాకు రాణితో చాలా విచిత్రంగా పరిచయం ఏర్పడింది. పరిచయం స్నేహంగా మారింది

మా స్నేహం చూసి నా స్నేహితులు నన్ను ఎగతాళి చెయ్యటం మొదలుపెట్టారు మాది స్వచ్ఛమైన స్నేహం అలాంటప్పుడు వాళ్ళనుకునే మాటల్ని ఎందుకు లెక్కచేయాలి? అనుకునేవాణ్ణి

రాణి ఆఫీసులో అడుగు పెడుతుండగా, ఒకడు, "అదిగోరా! రామంగాడి హృదయ రాణి" అన్నాడు

అందరూ పకాలున నవ్వారు

నా మూలంగా రాణి మాటలు పడటం నాకెంతో బాధగా వుంది

రాణి ఆ మాటలేవీ పట్టించుకోనట్లు, గబగబా తన సీట్లోకి వెళ్ళింది

నా మనసులో ఒక వూహ తళుక్కున మెరిసింది వాళ్ళనుకునేదే నిజం చేస్తే రాణిని నేను కాని—ఛీ ఛీ నేనెందుకిలా ఆలోచిస్తున్నాను

రాణితో నేనీ మాట అంటే నన్ను చూసి, రాణి అసహ్యించుకోవచ్చు రాణి మనసులో ఏముందో తెలుసుకోకుండా నేనే తొందరపడటం దేనికి?

స్వచ్ఛమైన మా స్నేహంలో విషబీజం నేనే నాటినవాణ్ణవుతానేమో!!

నేనీ వూహతోనే రాణితో పరిచయం కల్పించుకున్నానని, నా స్నేహమంతా నాటకమనీ రాణి అపోహపడితే నా మీదున్న సద్భావం తొలిగిపోతుంది

అదసలు నేను భరించలేను

"ఒరే రామం! ఏమిటో ఆలోచిస్తున్నట్లున్నావు వర్క్ చూడవోయ్ ముందు ఆఫీసర్‌చేత చివాట్లు తినగలవు" అన్న ప్రసాద్ హెచ్చరికతో, చటుక్కున నా చూపులు ఫైల్స్‌వైపు తిప్పాను

ఉరుములు మెఱుపులు వున్నట్లుండి లైట్లు ఆరిపోయాయి గాలివానకి కరెంట్ ఫెయిలయింది గాబోలు ఆలోచనలకి అంతరాయం కల్గింది

బయట చీకటి యింట్లో చీకటి మనసులో చీకటి లేచి బెడ్‌లాంప్ వెలిగించాను

నాకు అమ్మ మాటల్లో అర్థం యిప్పుడు తెలిసింది ఏం లాభం? ఆలస్యంగా తెలుసుకోగలిగాను అమ్మ, నన్ను పెళ్లి చేసుకోమని పోరేది పెళ్లి పెళ్లి అనగానే ఏదో భయం పెళ్లి వెనకే పిల్లలు ఆ బాదరబందీ మెడక్కట్టుకోడం యిష్టంలేక, "చూద్దాంలేమ్మా ఇప్పుడేం తొందర" అని దాటుకునేవాణ్ణి

"అవును ఇప్పుడే ఏం తొందర? పాతికేళ్లేగా నీకు ముచ్చటగా ముప్పయ్యేళ్లు వచ్చాక అప్పుడే చేసుకోవచ్చు" అని కసురుకుని, "ఒరే! రామూ! నేనంటే నీకు పోరుపెట్టినట్లే వుంటుంది ఇప్పుడు నా మాటలు అర్థంగావురా నీకు" అని బాధపడేది

ఇప్పుడు నాకనిపిస్తున్నది బద్ధకించిననాడు యిన్ని కాఫీనీళ్లుపెట్టే దిక్కులేదు పెళ్లి చేసుకోమని పోరేందుకు యీనాడు అమ్మలేదు అమ్మ అన్నట్లు ముప్పయ్యేళ్లు దాటినయ్యి నా అనేవాళ్ళు లేని ఒంటరివాణ్ణయ్యాను

గతించినదానికి బాధపడి ఏం లాభం?

బయట గాలివాన జోరు తగ్గింది సన్నగా జల్లు కురుస్తున్నది

మరొక్కసారి ఆరోజు ఉదయం జరిగిన సంఘటన కళ్లముందు మెదిలింది

రాణి టైప్‌రైటర్ ముందు కూర్చుని 'కీ' బోర్డుమీద వేళ్లుంచింది అలవాటైన కళ్లు లెటర్స్ చూస్తున్నయ్యి అనుగుణంగా వేళ్లు టైప్ చేస్తున్నయి కానీ ధ్యాస అటున్నట్లు లేదు ఆ టైపుచేసే తీరే అదోలావుంది

ప్యూన్ వచ్చి ఆఫీసరుగారు పిలుస్తున్నారని, రాణిని పిల్చాడు

రాణి ఖంగారుగా టైపు చేసిన కాగితాలు తీసుకుని ఆఫీసరు రూమ్‌లో అడుగుపెట్టింది

# సత్తయ్య కష్టజీవి. పాపం!
# జీవితంలో పూలు పూయవు గాని
# చేతుల్లో మాత్రం కాయలు కాస్తున్నాయి.

సత్తయ్య కారు మెకానిక్కు—కారు రిపేరులో
తనకు తెలియని విషయం అంటూ ఏదీ లేదు.
పాపం, నెలరోజులు కండలు పిండి, పనిచేస్తే,
వచ్చే జీతం రు. 150 లు.
మనిషి అన్న తరువాత ఆశలు సహజం.
తానూ ఆశించాడు.
ఏమని ?
తనదిగా ఒక గ్యారేజి పెట్టుకోవాలని,
పేరుతోపాటు నాలుగు డబ్బులు సంపాదించాలని,
భార్య పిల్లలు కళకళ లాడుతుంటే చూడాలని.
ఆశ ఆశగానే నిల్చిపోయింది.
మనసులో క్రుంగి పొయ్యాడు.
మంచి రోజులు ఎప్పుడో ...

ఏం పరవాలేదు. ఆశలు నిజమవుతాయి.
ఎలా|? ఎవరు ఆదుకొంటారు ?

## ఎవరో కాదు!

అందుబాటున ఉన్న మన
ఆంధ్ర దేశపు భాగ్యలక్ష్మి




ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ లాటరీ

డైరెక్టర్ ఆంధ్రప్రదేశ్ స్టేట్ లాటరీ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము హైదరాబాదు-500001

Kalpa/apsl/9/75 tg/a

# చేదు నిజం

ఏం జరిగిందో ఏమో!! తిరిగి వస్తున్న రాణి ముఖం పాలిపోయింది

"ఒరేయ్! వలపులో పడి మనసూ, ఆలోచనలూ మరొకచోట వుంటే వర్కు ఏం చేస్తుంది?" మెల్లగా అన్నారు ఒకరు

నాలో కోపం బుసలు కొట్టింది ఛీ ఛీ ఏం మనుషులు? మనుషుల్ని అర్థం చేసుకోలేని, వీళ్ళ చదువూ, సంస్కారం ఎందుకు? తగలెయ్యనా!

ఇద్దరు స్త్రీ పురుషులు స్నేహంగా వుంటే, ఆది స్నేహం అనుకుని పూరుకోరు లేనిపోని అర్థాలు తీసి, వాటికి రంగులు పూసి ప్రచారం చేసిందాకా, నిద్ర పట్టదు కొందరికి

రీసెస్ టైమ్‌లో అందరూ క్యాంటిన్ కెళ్ళారు రాణి వెళ్ళే ప్రయత్నంలో లేదు

"రాణీ! వస్తారా కాఫీ తీసుకుందాం" ఎలాగో, అడిగాను

"రాలేను" — అంది

తప్పులుపడ్డ లెటర్స్ మళ్ళీ టైప్ చేస్తున్నది

నాకూ వెళ్ళాలనిపించలేదు

"రామం! మీ రెళ్ళలేదేం"— యింకా నేనక్కడే వుండటం గమనించి అడిగింది

"వెళ్ళాలనిలేదు" అన్నాను

"వాళ్ళ అపోహలకు యింకా దోహదమిస్తున్నది, మీ ప్రవర్తన"

"అనుకోనీండి వాళ్ళ మాటలకు నేను భయపడను" నిర్లక్ష్యంగా అన్నాను

"మీరు మగవారు ఏ విషయాన్నీ సీరియస్‌గా తీసుకోరు కానీ, ఆడదాన్నేగా ఎవరైనా అనగలిగినా ఆఫీసర్ కూడా మన గురించి చెడ్డగా వూహిస్తున్నారు స్నేహంచేస్తే అదీ పాపమేనా! యింత అవమానం పొందినందుకు యీపాటికి ఉద్యోగానికి రిజైనుయిచ్చి వుండేదాన్ని కానీ, ఈ జీతంమీదనే మా ఆధారం నామీద ఆధారపడిన వారికోసమైనా ఈ వుద్యోగం చేయక తప్పదు పోనీ, యింకొక ఉద్యోగం చూసుకుందామన్నా అంత త్వరగా దొరుకుతుందనెక్కడ? దొరికినా, అక్కడా యిలాంటి అవమానాలు తప్పవనేమిటి?" — రాణి కళ్ళల్లో నీళ్లుతిరిగాయి

రాణిని చూస్తే నాకు జాలేసింది

రాణితో మా పెళ్లి విషయం అడగాలని ఎప్పట్నించో అనుకుంటున్నాను ఎలాగైనా యీరోజు అడగాలి సాయంత్రం అయిదుగంటలు కాగానే ఫైల్స్ సర్దేసి బయల్దేరాను రాణివైపు చూశాను వస్తుందేమోనని

"రామం, వెళ్దాం పదండి" అంది రాణి

దారిలో, "రాణీ మనకింత స్నేహమైనా నన్నెప్పుడూ మీ యింటికి ఆహ్వానించలేదు మీవాళ్లని పరిచయం చేయనేలేదు" అన్నాను కొంచెం నిష్ఠూరంగా

"మీరుమాత్రం నన్నెప్పుడైనా మీ యింటికి పిలిచారా? మీ శ్రీమతిని పరిచయంచేశారా?" అంది నవ్వుతూ

నువ్వే నా శ్రీమతివి కాబోతూంటే, ఇంకా శ్రీమతిని పరిచయం చెయ్యడమేమిటి? అనుకున్నాను మనస్సులో

కానీ, పైకిమాత్రం, "అసలు నాకింకా పెళ్ళేకాలేదు గదండీ బ్రహ్మచారి మరానికి ఏమని ఆహ్వానించను ఇప్పటికే మీరు నామూలాన అపనిందలకు గురిఅయ్యారు" అన్నాను

"సారీ మీకు వివాహమైందనుకున్నాను" అంది

"ఇవ్వాళ మా యింటికివెళ్దాం పదండి" అంది, ఉత్సాహంగా

ఆ అవకాశంకోసమే చూస్తున్న నేను, అనడమే తడవుగా "పదండి" అన్నాను

వాళ్ళ వాళ్ళతో మా పెళ్లి విషయం మాట్లాడాలి అనుకోని యీ సంఘటనకు రాణి ఎంత ఆశ్చర్యపోతుందో చూడాలి

మా పెళ్లి శుభలేఖ చూపి, మా కోక్లర్క్‌తో "ఒకనాడు మీరన్నట్లు రాణి రామంగాడి హృదయ రాణిరా" అని నేనంటే వాళ్ల ముఖాలు యెలా వుంటయ్యో చూడాలి అని నేను తలచుకుంటుంటే, గర్వంతో నామనసు ఉప్పొంగింది

"ఇదే మా యిల్లు" అంది రాణి

"రాణీ మిమ్మల్నొక విషయం అడగనా మీ అభిప్రాయం తెలియచేస్తారా" అన్నాను ధైర్యాన్ని కూడదీసుకుంటూ

"ఓ! తప్పకుండా చేస్తాను ఏ విషయం గురించేమిటి? లోపలికిరండి కూర్చుని మాట్లాడుకుందాం" అంటూ, లోపలికి దారితీసింది

రాణిని అనుసరించాను

లోపల చక్రాల బండిమీద ఒక యువకుడు కూర్చుని, ఏదో నవల చదువుతున్నవాడల్లా ఆలికిడికి తలెత్తి మావైపు చూశాడు అతను చాలా అందంగా వున్నాడు చురుకైన వ్యక్తి కానీ, రెండుకాళ్ళూ లేని అవిటివాడు అదొక్కటే లోపం

"రాణీ, వారెవరు?" సంస్కారం వుట్టిపడే స్వరంతో సరళంగా అడిగాడు, ఆ యువకుడు

"రామంగారు" అంది రాణి

"నమస్కారమండీ" అన్నాను నేను

"నమస్కారం రండి కూర్చోండి రామంగారూ మీగురించి రాణి చెపుతుంటుంది మీరు మారాణికి ఆఫీసు విషయాల్లో స్వంత అన్నకన్నా మిన్నగా సహాయపడుతుంటారని మీకు చాలా థాంక్స్" అన్నాడు, అతను కృతజ్ఞతగా నావైపు చూస్తూ

రాణి నావైపు తిరిగి, "మీకు పరిచయం చేయనేలేదుగదూ వీరు మాశ్రీవారు ఎం ఏ చదివారు" అంది

నాతల గిర్రున తిరిగింది అయితే అయితే రాణికి పెళ్లయిందా! యీ అవిటివాడు రాణి భర్తా!!

"ఒక దురదృష్టకరమైన వేళ యాక్సిడెంట్ జరిగింది అప్పుడు ఆయన రెండు కాళ్ళూ పోయినయ్యి విధి మాపై యీవిధంగా చిన్నచూపు చూసింది ఇలా జరిగివుండకపోతే నాకీ వుద్యోగమే చేసే అవసరమే వుండేదికాదు" — గాద్గదిక స్వరంతో రాణి అంటున్న మాటలు నాకు వినాలనిపించలేదు

"ఊరుకో రాణీ! జరిగిందానికి ఏంచేస్తాం" మృదువుగా అన్నాడతను

"రాణి ఎప్పుడూ మీగురించే చెప్తుంటుంది మీరు రాణికి మంచి స్నేహితులుట నిజంగా మీ పరిచయం కలగటం నా అదృష్టం" తెగ పొగిడేస్తున్నాడు

నా వూహ తెలిస్తే ఏమనుకునేవాళ్ళో

అనుకోని ఆ సంఘటనకు తల దిమ్మెక్కిపోయింది నాకు ఇంకొక్క క్షణంకూడా అక్కడ వుండలేకపోయాను

"మా విషయాలు చెప్పి మిమ్మల్ని విసిగించినట్లున్నాము ఇందాక మీరేదో విషయంలో అభిప్రాయం అడిగారు ఏమిటది?" అడిగింది రాణి

"ఆ అహ ఏంలేదు పనుంది మళ్ళొకసారి వస్తాను" అంటూ ఎలాగో అక్కణ్ణించి, యింటికొచ్చిపడ్డాను

ఇలా నేనాలోచిస్తూనేవున్నాను, ఎప్పుడు తగ్గిందో గాలివాన పూర్తిగా తగ్గిపోయింది

కిటికీ తలుపులు తెరిచి ఆకాశంవైపు చూశాను ఇంతక్రితం ఉరుములు, మెరుపులుతో భీకరంగా నున్న వాతావరణం ఇప్పుడు ప్రశాంతంగా వుంది చల్లనిగాలి వీస్తున్నది

ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నయ్యి

"వాతావరణం నిర్మలమైన రాణి మనసులా వుంది"

## జీవన న్యాయం

స్వార్థం మెదడ్ని దొలిచేస్తోంది
పేరాశ ఆలోచనల్ని అణిచేస్తోంది
ఆధిపత్యం కోసం అన్యాయాలకు పోరతులిస్తూ
ఎరువు తెచ్చుకున్న పాపులారిటీతో
నడిబజార్లో అభిమానాన్ని సైతం
వేలం వేసేస్తున్నారు
అధికారంకోసం, పొగడ్తలకోసం
అవమానాన్ని అవలీలగా మింగేసి
అంతరాత్మను సైతం అంగట్లో అమ్మేస్తున్నారు!
తరిగే జీవన ప్రమాణంలో
పెరిగే ధరలకు
జీవితానికి పొత్తు కుదర్చలేక
చలికిలబడుతూ
మిణుకు మిణుకుమనే ఆశతో
నిరీక్షిస్తున్నాడు సామాన్యుడు
ఆశల్లో అలరిస్తూ
ఊహల్లో విహరింపచేస్తూ
అంతలోనే నిరాశతో కృంగదీసి
ఊహల ఉయ్యాలను పుటుక్కున
తెంపేదే జీవితం!
ఒకరిది పేరాశ — దుఃఖ భాజనం చేసేది
ఒకరిది ఆశ — ఆయువును పొడిగించేది

— వై యస్ లక్ష్మి


ప్రొద్దున్న ఉండే తాజాదనం,
సౌరభం రోజంతా
ఉంటుంది!
చన్నీళ్ల స్నానమిచ్చే తాజాదనము గంటల కొలదీ-పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ ఆ అనుభవమును రోజంతా యిస్తుంది. దానిని మీ ఒళ్లంతా జల్లుకోండి. మీరు తాజాగా, శుభ్రముగా మరియు చల్లగా ఉంటారు. దాని తేలికైన సువాసన మిమ్మల్ని పట్టి ఉంటే, అది చెమ్మను పీల్చి మిమ్మల్ని పొడిగా, సౌఖ్యముగా ఉంచుతుంది, ముఖ్యంగా మండు ఎండా కాలములో. చెమట వాసన, చర్మము నిగపట్టుట ఉండవు. పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ ఎంత మెత్తగా ఉంటుందంటే దానిని మీ ముఖము మీద కూడ రాసుకోవచ్చును.
పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్
Pond's Dreamflower talc
Dreamflower talc
మీడియం, ఫ్యామిలీ, మరియు ఇప్పుడు కొత్తగా 196 గ్రా. లార్జ్ సైజ్‌లో లభిస్తున్నాయి.

# డాక్టరు సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**ఏస్. ఎన్. — నిజామాబాద్.**

మా అబ్బాయికి, (10 సంవత్సరాల వయస్సు) 6 నెలల క్రితం కాలుమీద కురుపువచ్చింది అది ఇప్పటికీ మానలేదు ఆస్పత్రికి తీసుకువెళితే ఎముకకు చీము పట్టింది ఆపరేషన్‌చేయా లన్నారు మాకేమీ తోచటంలేదు. ఆపరేషన్ అంటే భయంగా ఉన్నది

కురుపులు రాగానే తగిన వైద్యం చేయక పోతే, ఆ కురుపులోని చీము క్రింద ఉన్న ఎము కకు విస్తరించటం సహజం, దీనిని "ఆస్టియో మైలైటిస్' అంటారు ఎముకలోని ఒకభాగం చీముపట్టడంవల్ల ఆభాగం పుచ్చినట్లవుతుంది. ఆభాగాన్ని "సెక్వెస్ట్రం" అంటారు దీనికి, యాంటీ బయాటిక్‌లతోబాటుగా శస్త్ర చికిత్స ద్వారా ఈపుచ్చిన ఎముకభాగాన్ని తీసివేయటమే చాలామంచి మార్గం.

**ఎ కె — హైదరాబాద్**

నా వయస్సు 30 సంవత్సరాలు గత4 సంవత్స రాలుగా నడుములో నెప్పి ఉన్నది వివాహమయి 5 సంవత్సరాలు అయింది హాస్పిటల్‌లో 12 సార్లు కరెంటు షాక్ ఇచ్చారు 2 నెలలు మామూ లుగా ఉండి తిరిగి ప్రారంభమయినది

వివాహమవటానికీ, నడుము నెప్పికీ సంబం ధములేదు కానీ కొన్ని కారణాలవల్ల వెన్నుముక లోని, వెన్నుపూసలు కొన్నితమ స్థితి తప్పి లేక వాచి, నరములకు రాపిడి కలిగించటంవల్ల ఇలా ఏర్పడ వచ్చును మలబద్ధకం, మూత్రము తయారై వెలుపలికి పోయేవరకు ఉన్న మార్గాలలో మార్పులు, అవరోధాలు, కడుపులో పుండు ఇలా రావటానికి కొన్ని ఇతర కారణాలు రోగాన్ని నిర్ణయించి వైద్యం చెయ్యాలి

**జి. కె. — విజయవాడ**

నా వయస్సు 35 సంవత్సరాలు, నాకు గత 10 సంవత్సరాలుగా ఏగతగా ఉండి 2 గంటల సేపు నిద్రవస్తుంది ఆ తర్వాత మెలకువ వచ్చే ముందు చెవులో హోరుగా ఉండి కండ్లు తెరవ లేకపోతాను

చెవినుంచి మెదడుకుపోయే నరము యొక్క మార్గములో ఏదైనా వత్తిడి తగిలినప్పుడు లేక ఈ నరం మెదడులో ప్రవేశించే ప్రదే శంలో ఏదైనా మార్పులు ఉన్నప్పుడు ఇలా జరుగుతుంది

మీరు 'ఇ ఎన్. టి' వైద్యులనుగాని, నర ముల వైద్యానికి సంబంధించిన స్పెషలిస్టులను గాని సంప్రదించండి.

**బి ఉ అర్. — అనకాపల్లి**

మా 3 సంవత్సరాల పాప పొరపాటున వేడి నీళ్లలో ముఖం ముంచటంవల్ల ముఖంమంతా బొబ్బలు లేచినవి మందులు వాడగా తగ్గి మచ్చలు ఏర్పడినవి ఈ మచ్చలు పోవాలంటేఏంచేయాలి ?

ఇలా వేడివలన ఏర్పడిన మచ్చలు కాలక్రమేణా, తగ్గుతాయిగాని ప్రత్యేకించి మందులు వాడటం వల్ల ఎక్కువ ఫలితం ఉండదు 'ఆలివ్ ఆయిల్' ముఖానికి పట్టించి మెల్లగా రుద్దితే మంచిది.

**ఎన్. కె — కాకినాడ**

నా వయస్సు 16 సం లు ఒక నె నుండి నుదుటిమీద విపరీతంగా పొక్కులు లేస్తున్నాయి. మొటిమలయితే బుగ్గలమీదే లేస్తాయికదా! కాని మొహమంతా వచ్చాయి ఏమి వాడమంటారు?

మొటిమలనేవి తరచూ బుగ్గల మీదనే కన బడుతూ ఉన్నా, నుదుటి మీద రాకూడదని సిద్ధాంతము లేదు మొటిమలు చర్మంలోని స్వేద గ్రంధుల తాలూకు 'సెబేషియస్ గ్లాండ్స్' నుంచి వెలువడే నాళములో అడ్డుపడటం వల్ల ఏర్పడతాయి. ఇలా జరగటం యవ్వన ప్రారంభ దశలో ఎక్కువగా కనిపిస్తుంది దీనికి హార్మో నుల పనితనం ముఖ్య కారణమని అంచనా

సాలిసిలిక్ ఆసిడ్ 5 శాతం, హెక్సైల్ రిసార్సి నాల్ 5 శాతం, సల్ఫర్ 5 శాతం, ఈ మూడూ కలిపి ప్రత్యేకంగా ఆయింట్‌మెంట్ తయారు చేయించుకొని 1 నెల వాడితే తగ్గిపోతాయి

# ఈ సంఘంలో కుటుంబమే శిక్ష!

( 16వ పేజీ తరువాయి )

అప్పుడు అతడి మనసంతా ఒకటే గందరగోళంగా ఉందాయె ..

అయినా కోదండం కామవరపు జీడిలా పట్టుకొని గోపాలరావును తనయింటికి తీసుకు వెళ్ళాడు

నెహ్రూ నగర్‌లో— కోదండం తీసుకున్న ఇల్లు బాగానే ఉంది. రెండంతస్తుల మేడ క్రింది భాగంలో ఒక వాటాలో ఉంటున్నాడు ఇంటిలోపలకూడా ఎంతో నీటుగా ఉంది.

కాసేపు ఇంటి అద్దె, ఇరుగు పొరుగుల గురించి మాటాడుకున్న తర్వాత కోదండం అడుగు పెట్టెలో ఎక్కడో అడుగు పట్టి ఉన్న ఒక ఫొటో తీసి చూపాడు గోపాలరావుకు

అది అతడి పెళ్లినాటి ఫొటో . అప్పుడు కోదండానిది చాలా లేత వయసు పెళ్ళికూతురికి కూడా పది పన్నెండు సంవత్సరాలకు మించి ఉండవు.

''మాది ఒక కుగ్రామం. .దానికి తగ్గట్టే మా పెద్దలవి తగని మూఢాచారాలు అందుకే నాకు పద్దెనిమిదవ ఏటే పెళ్లిచేశారు నేను చేసుకున్నది ఎవరో పరాయి పిల్లనికాదు నా మేనమామ కూతుర్నే . మా నాన్నా వాళ్ళకు డబ్బు ఆశ. మామయ్యా వాళ్ళకు చాలా ఆస్తి ఉంది.. అందులో సుగుణ వాళ్ళకు ఒక్కగానొక్క బిడ్డ... రెండు వైపుల ఆస్తులూ కలిస్తే మేమెంతో సుఖంగా బ్రతుకుతామని మా పెద్దలు నమ్మారు ..చదువు పూర్తయ్యే వరకు చేసుకోను అన్నా నా మాట ఎవరూ వినలేదు పైగా 'నీవు మా మాట వినకపోతే పట్నం పంపి కాలేజిలో చదివించం అని బెదిరించారు చదువుమీద అపేక్షను చంపుకోలేక చివరకు తల ఒగ్గాను వాళ్ల మాటకు

''మా పెళ్లప్పటికి సుగుణకు పన్నెండేళ్లు నేను పట్నవాసం వచ్చి కాలేజీ చదువుల్లో ప్రవేసించాక నా అభిప్రాయాలు ఒకటొకటే మారుతూ వచ్చాయి.. సుగుణకు పదమూడవ ఏడు వచ్చింది. అప్పడే అది పెద్దమనిషయిందన్నారు. మరి ఆర్నెల్లకు శోభనం చేస్తామన్నారు వాళ్లమాటలకు నవ్వాలో ఏడవాలో అర్ధం కాలేదు. పట్టుమని పన్నెండేళ్లునిండని ఆడ పిల్లకు అప్పడే శోభనం ! పదమూడేళ్లు నిండేసరికి ఒక బిడ్డ తల్లిగా సంసారపు రొంపిలో పడిపోవటం!. .నాకు పెద్దల మాటంటే తగనిరోత అనిపించింది .. అయినా వాళ్లను తిరస్కరించినట్లు మాట్లాడక చదువులంకె పెటాను అది పూర్తయ్యే వరకు అలాంటి ఆలోచన నేను పెట్టుకోను అని మామూలుగానే చెప్పి ఒప్పించాను అలాగే నా చదువు పూర్తయింది ఆ తర్వాత మళ్లీ మొదలు— ఉద్యోగం రావాలన్నాను...త్వరగానె వచ్చింది... అందులో నిలదొక్కుకున్నంతవరకు— అని గడువు పట్టాను

''అప్పటికి సుగుణకు పదహారేళ్ళు నిండలేదు నేను స్త్రీనిగురించి చాలా చాలా పుస్తకాలు చదివాను . ఎంతో ఆలోచించాను . ఆడదికూడా మన లాంటి మనిషి. కాబట్టి ఆమెను బానిసగా చూడకూడదు ఒకమనిషికి ఉండవలసిన స్వేచ్ఛ- స్వాతంత్ర్యం యిచ్చి సహధర్మచారిణిగా గౌరవించి చూసుకోవాలి స్త్రీని- ఇలాంటి ఆదర్శాలు మనసులో పెట్టుకొనే నేను ఆమెవిషయంలో నిగ్రహించుకొన్నాను. కనీసం పద్దెనిమిదవ ఏడు వచ్చేవరకు సుగుణను తాకరాదని శపథం పట్టాను .. అయితే నా సదుద్దేశ్యాలను అపార్థం చేసుకున్నారు మా పెద్దలు , 'పట్నంలో దేన్నో మరిగి పెళ్ళానికి దూరంగా ఉండాలని ప్రయత్నిస్తున్నావ్'అని అభాండం వేశారు ఇక ఆ సరఘోషపడలేక నేను వాళ్ళమాటకు సరే అన్నాను అప్పుడు సుగుణకు పదిహేడవ ఏడు గడుస్తోంది..

అంతా యధావిధిగానే జరిగింది .తీయటి విగా తలచి సుగుణతో కొన్ని రాత్రులు అనుభవించాను అయితే ఒకరాత్రి . నేను కళ్ళు తెరచి చూసేవరికి ప్రక్కన అది లేదు గది తలుపులు తెరచి ఉన్నాయ్ . వెళ్ళి చూస్తే పెరట్లో 'మామయ్యా వాళ్లింటి ప్రక్కింటి అబ్బాయి ఆంజనేయులుతో ఉంది... తాళి కట్టిన భర్తను ప్రక్కనే ఉండగా అది అంత సాహసానికి ఒడిగట్టింది ... అంతటితో నా జీవితమే శూన్యమైంది ... అప్పట్నుంచీ స్త్రీని స్త్రీగా చూడాలంటేనే నాకు అసహ్యమనిపించింది .. అందం కేవలం అనుభవించటానికే, డబ్బు విలాసంగా ఖర్చుపెట్టుకోవటానికేనని భావించి నాయిష్టం వచ్చినట్లు సంచరించటం మొదలు పెట్టాను...

''ఆనాడు మీ యింటికి వచ్చినప్పుడు నన్ను పెళ్లి చేసుకొమన్నారు . . మీ యిల్లు, పిల్లలు, సంసారం చూశాక ఆడవాళ్లందరూ ఒకే తీరుగా ఉండరనిపించింది అదీగాక

సుగుణ చివరకు ఆ ఆంజనేయుల్నే పెళ్లి చేసుకొని ఇద్దరు బిడ్డల తల్లయింది అని మొన్ననే మా వూరతను ఒకడు కనిపించి చెప్పాడు ... సుగుణను వదిలిన తర్వాత నేను తిరిగి మావూరు వెళ్లలేదు ఇపుడు మరో స్త్రీని వివాహమాడి సుగుణ మోహాన తన్నినట్లు మావూరు వెళ్లి నా వాళ్లందరికీ కనిపించాలనిపిస్తోంది ''

—గోపాలరావు అక్కడక్కడ ఏవో నాలుగు ముక్కలు చెవిన వేసుకున్నాడేకాని కోదండం చెప్పింది పూర్తిగా వినలేదు

''అలాచేస్తే బాగానే ఉంటుంది కోదండం'' అన్నాడు అతడు చెప్పిన చివరి మాటలకు సమాధానంగా

తర్వాత గోపాలరావు బయలుదేరాడు లక్ష్మణ్ణించి అప్పటికి ఆరున్నరో ఏమో అయింది సమయం

సెంటరు మరో యాభై గజాల దూరం ఉందనగా నలుగురు కుర్రాళ్లు ఎదురువచ్చారు. గోపాలరావుకు — వాళ్లందరి చేతుల్లోనూ ఎరగా కాలుతున్న సిగరెట్ పీకెలు ఉన్నాయి. వేషధారణను బట్టి వాళ్లంతా చదువుకోనే కుర్రవాళ్లలా తోచారు

[వీళ్లంతా కాలేజీలకు వెళ్లేది విద్యనార్జించటానికా లేక వ్యసనాలకు దాసులు కావటానికా ?]

వీధిలైట్లు దేదీప్యమానంగా వెలుగుతన్నాయి వాళ్లకు తనెందుకు ఎదురు వెళ్లటం అని మరో ప్రక్కకు తప్పుకున్నాడు గోపాలరావు

''ఒరేయ్ మధూ, అటుచూడు ... మీ నాన్న !'' - ఎవరో కుర్రవాడు అనటం వినిపించింది అతడికి

''ఏడి ఎక్కడరా ?'' — ఆందోళనా మిళి

## ఈ సంఘం-లో కుటుంబమే ఇది !

తంగా ఉన్నా—అది మధుస్వరమే.

'' అడుగో '' — తనవైపే వేలుపెట్టి చూపిస్తున్నాడొక కుర్రాడు.

అంతటితో చేతిలోఉన్న సిగరెట్ పీకెను నేలకు విసిరికొట్టి — ఓ కుర్రాడు పరుగెత్తిపోవటంచూశాడు సందేహంలేదు వాడు మధే.

''నీకేం భయంలేదు. వెళ్లకు. ఉండు రొరేయ్ మధూ'' అంటున్నాడు ఆ గ్యాంగిలో ఒకడు—అతడేగామాలు వాళ్ల కథానాయకుడు.

ఎంత నిర్భయం ? .. పెద్దలంటే కాస్త కూడా గౌరవం లేదు ... ఇటువంటి జులాయి రాయిళ్లు రేపు — బావి భారత పౌరులు ! 'హుం ' విరక్తిగా నవ్వుకున్నాడు ఆ వెంట అతడి ఆలోచనలు తన కొడుకు మధు మీదకు మళ్లాయి .. తను వాడికి చెప్పిందేమిటి ? వాడు చేసిందేమిటి ? ... ఇంటికి వెళ్లనీ వెధవకు బుద్ధివచ్చేట్లు చేయాలి...

.. అలాగే సెంటర్లోకి వచ్చాడు . అక్కడ ఒక ప్రక్కగా రెండుమూడు సెకండ్ హాండ్ బుక్స్టాల్సు ఉన్నాయి .. వాటిల్లో చిట్టచివర ఉన్నదే రాముది

'' వచ్చారా .రండినాన్నగారూ...రండి'' అంటూ ఎంతో వినయ విధేయతలు కనబరచి తండ్రిని తీసుకువెళ్ళి ఓ కుర్చీలో కూర్చోబెట్టి తను నిలబడ్డాడు రాము

''బాగా సాగుతోందా వ్యాపారం? .రోజుకు ఎంత అమ్ముతున్నావ్ ? ఎంత లాభం మిగుల్తోంది ?''లాంటి ప్రశ్నలతో కొంత కాలం గడిచిపోయింది. ఆ తర్వాత కృష్ణను గురించి అడిగాడు.

''లేదు నాన్నగారూ...అప్పట్నుంచీ వాడు ఇంటికి రాలేదా?''—రాము ఎదురు ప్రశ్న వేయటంతో గోపాలరావుకు గుండెలు బరువెక్కినట్లయింది.

''లేదురా'' అన్న తర్వాత చాలాసేపు ఏ మాట మంతీలేకుండా అలాగే కూర్చుండిపోయాడతడు.

చివరకు ఏం బుద్ధి పుట్టిందో—

''నీవు ఇంకా ఎంత సేపు ఉంటావ్ ?'' అడిగాడు

''నాతో ఏదైనా పని ఉందంటే వెంటనే కట్టేసి వచ్చేస్తాను ''అన్నాడు రాము.

''అంత అర్జంటేం లేదు . కానీ... నాకు 'ఆమె'ను చూడాలని ఉంది... వెళ్దాంరా ..''

''అది నేను వెళ్లవలసిన చోటేకానీ మీరు రాదగ్గ ప్రదేశం కాదేమో అంతకూ ఆమెను మీరు చూసితీరాలి అంటె నేనే మన యింటికి తీసుకువచ్చి చూపుతాను. ''

'' ఏం? నేను అక్కడకు రాకూడదా?''

''అది కాదు నాన్నగారూ... మీరు ఏమీ అనుకోనంటే నేను ఒకటి అడుగుతాను...''

''అడుగు ''

''మట్టిపాత్రలో అమృతం ఉంది. వెండి పాత్రలో విషం ఉంది—సామాన్యంగా మనిషి ఆ రెండింటిలోనూ దేన్ని తీసుకోవటానికి ఇష్టపడతాడంటారు? ''

''.... .''

''సమాధానం తెలుసు మీకు. కానీ చెప్పరు ...అదికూడా నేనే చెబుతాను . పైమెరుగును చూసి వెండి పాత్రనే కోరుకుంటారు చాల మంది...శంఖంలో పోస్తేగాని తీర్థం కాదన్నట్లు—ప్రస్తుతం ఆమె ఉన్న ప్రదేశాన్ని చూస్తే మీ అభిప్రాయాలు వేరే విధంగా మారతయ్ అందుకని మీరిప్పుడు నా కూడా రావటంకంటే రేపు . ''

రాము మాటలు పూర్తి కాలేదు. గోపాలరావు చటుక్కున లేచాడు

''వీల్లేదు . ఇప్పుడే ఆమెను చూడాలి... పద వెళ్దాం...పోనీ, నీకు నాతోపాటు రావటం ఇష్టంలేకపోతే ఆ యింటి అడ్రసు చెప్పు. నేనే వెళ్తాను'..''అన్నాడు.

''మీరు ఒక్కరే దేనికి ?... ఇద్దరమూ వెళ్దాం ఉండండి. .'' అని కొట్టుసర్ది తాళం వేసే ప్రయత్నంలో పడ్డాడు రాము

మరో పదినిమిషాల్లోనే అక్కణ్ణించి బయలుదేరారు ఆ తండ్రీకొడుకులు

(ఇంకావుంది).



"నేను మెచ్చే లక్స్
ఇప్పుడు మైమరపించే
కొత్త సౌరభాన్ని
అందిస్తోంది!"

అంటున్నారు మంజుల

మిమ్మల్ని ఆహ్లాదపరిచే మృదువైన లక్స్ యొక్క సరికొత్త సౌరభాన్ని మీరు ఎంతో మెచ్చుకుంటారు ఎందుకంటే, లక్స్ ఎంతో శుద్ధమైనది మరియు మృదువైనది అది మీ రూపాన్ని కోమలంగా తీర్చిదిద్దుతుంది—అవును, మంజులవలెనే.




లక్స్—సినిమా తారలువాడే శుద్ధమైన, మృదువైన సబ్బు

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన

రుచిర; కళ కొత్తగూడెం.

మనిషిని మానవత్వాన్ని మత్తులో ముంచి వారి ఆలోచనలని అణచివేసే నేటి నవలావాఙ్మయం

చాలు మీగోల! ఇప్పుడెక్కువగా ఆడపేర్లు కన్పిస్తుంటే యిలా ఆడిపోసుకుంటారే—ఇంత కాలం మా "నవలారాజులు" సృష్టించిన దాంట్లో మత్తూ చెత్తా ఏం కన్పించడంలేదా కనీసం నేడు స్త్రీలు—యింటిపట్నున జరుగుతున్నదోపిడీని చిత్రీకరిస్తున్నారు — ఆడదాన్ని హింసించితేగాని కరుణాపుట్టదు! ఆడది ఏడిస్తేగాని సినిమాలు పేలవు ఆడది అన్నీ వదులుకోవడం త్యాగం అన్నిటికోసం మగవాడు నమ్ముకున్న స్త్రీని వదలడం —త్యాగం! ఎంతతప్పుడు తూకం యిది!. యీ పరిస్థితిని మసిపూసి మారేడుచేసి సంఘం ఎంఘం అంటూ గొంతు చించుకోవడం—మీ కంఠ శోష !!

వి ఎస్ డి. ధవళేశ్వరం.

మీరు ఆడవాళ్లని చాలా సపోర్టు చేస్తూ మాట్లాడుతారని పిస్తుంది నాకు మీ మూడో మనిషిలో వసంత పాత్రని మరీ ఆకాశానికెత్తేశారు అర్థం లేని త్యాగాలు చేయిస్తూ!

మీరా నవల మళ్లీ ఓ సారి చదవండి ఒక్క త్యాగం కూడా చేయకుండా, ఒక్క సారైనా యిష్టం లేని పనికి తలొగ్గకుండా— సాధించాలనుకున్నది సాధించి కోరుకున్న మగవాడిని పెళ్లాడ కల్గిన వసంత మీకు త్యాగమూర్తిలా ఎలా కన్పించింది? ఆమె ఫైటర్!

# ప్రశ్నావళి

**కె. రామలక్ష్మి**

డి ఎస్. ఆర్ సిద్దిపేట

పసితనంలో వేసే ప్రతి అడుగు ఎంతో ముద్దు కాని వయస్సులో వేసే ప్రతి తప్పటడుగూ?

అవును— తొలి తప్పటడుగలు మన గమనానికి నాంది వయసులో వేసే తప్పటడుగులు పతనానికి నాంది!

ఎస్. వి ఆర్ బేతంచెర్ల

ఆడవారిని అర్థం చేసుకోడం ఎలా?

అర్థం చేసుకోవడం ఎందుకూ? మెం మగవాళ్లని అర్థం చేసుకుని ఏం సాధించాం కనుక?!

ఎస్ ఎల్. ఎస్ హాలెబీడు.

ధనము గొప్పదా? దైవము గొప్పదా?

ధనమున్న దైవం గొప్ప

ఎన్ ఆర్ కె. ఆర్. వెదాళ్లపల్లి.

డబ్బున్నవాళ్లు డబ్బు లేనివాళ్లు అనే హెచ్చు తగ్గులు తొలగే రోజులు ఎప్పుడొస్తాయి?

రావు! ఈ గొప్పవాళ్లు పోతె యింకో గొప్పవాళ్లు వస్తారు !!

మగవాళ్లంటే మీకెందుకండీ అంత కోపం?

కోపం కాదు— ఉడుక్కునే వాళ్లని ఏడిపించడం ఎవరికేనా—సరదాగా వుంటుంది కదూ! ?

డి హెచ్ కె ఆర్. హైద్రాబాదు.

ప్రేమకు నిర్వచనం?

రెండు ఏకాంతాల పురస్కరింపు ప్రేమ.

ప్రేమించినట్టు ఎలా తెలుస్తుంది?

ఏ ఆడదాని దగ్గిర నువ్వేం దావలేవో— అప్పుడు నువ్వామెని ప్రేమిస్తున్నావన్నమాట!

సౌశీల్యం కల స్త్రీని ఎలా గుర్తించటం?

అందమైన ఆడదాన్ని నువ్వు చూస్తే—సౌశీల్యం గల ఆడది నిన్ను చూస్తుంది

ఎ ఎస్ నాగార్జునసాగర్.

ప్రతి ఆడువారు అందంకోసం ప్రాకులాడుతారెందుకు

అందమైన ఆడది చెప్పిన మాట మీ మగవాళ్ళు వింటారని భ్రమసి

పి బి వి. ఆర్. మొగలికుదురు.

నేటి యువకులు చెడిపోడానికి కారణం యువతులా లేక యువకుల్లోని బలహీనతా?

ఒకళ్లవల్ల ఒకళ్లు చెడిపోయేది— దృఢమైన ఆత్మవిశ్వాసం లేకపోవడం వల్లే

కె పి ఆర్ వెదచెర్ల

స్త్రీలు క్లబ్బులకు వెళ్ళి మన సంస్కృతి మంట కల్పుతున్నారు

పురుషపుంగవులంతా వెళ్ళినా మంటకలవని మన సంస్కృతి ఒక్క స్త్రీలు క్లబ్బుకివెడితే మంట కలుస్తుందంటే నాకు నమ్మకంలేదు సార్!

ం / ఎ ధక శకి శ టక బం ండం
ఆకాడము, స్వస్థమైన రస మ గువారె వి ష ఆరోగ్య
ంతుల గా ఎిబ ంషుదున్నారు

ఆయుర్వేద ఔషధము ఫ్రభావము నమ్మనివారు
ఇప్పటికినీ కొందరున్నారు అట్టివారికి ఉదాహరణగా మేము
'జీవన్‌టోన్'ను తయారు చే యున్నాము ఈ మందు
మార్కెటులో సంస్థిత మమ్మైన నవ స గల్గియుండు
టచే అనేక వేలమంది యింకనూ దీనిని ఉపయోగించు చు
సంపూర్ణ ఆశలను, తృప్తిని పొందుచున్నారు

ఈ బలవర్ధకౌషధము మహామోపేతమైన
గుణములు గెలిచినటుచే ప్రచారము చేయపనిలేదు

ఈ బలవర్ధని లభ్య ముయున్న వారి సరిపడు
దీనిని ఒకపొరు వాడినపుడవ దీనిగుణము తెలియగలదు
మామూలు బరువు, శరీర సౌష్ఠవము గల్గిన తరువాత ఈ
మందున ఉపయోగించ నవసరము లేదు (కాలపరిమితి—
నాలుగు లేక ఐదుపౌనుల వరకు ఉపయోగించవలెను) దీనిని
సేవించు సమయమున ఎండలో తిరుగుట మానవలెను
మంచి నిద్ర ముఖ్యావసరము •

'జీవన్‌టోన్' హటాత్తుగ శరీరమునకుబరువును,
సౌష్ఠవమును చేకూర్చుట చేత ఇది జంతువుల క్రొవ్వు
పదార్థము గల్గియున్నదని కొందరు అనుమానించుచున్నారు
అట్టివారికి ఇందులో కాయికూరల క్రొవ్వును, సులభముగా దొరకని వనమూలికలును మాత్రమే చేరియున్నవని మనవి చేయుచున్నాము.



TRADE MARK

జీవన్‌టోన్

Regd No. 218726

'జీవన్‌టోన్' రోజురోజు అతి త్వరితగతిని పురోగమించుచున్నది అస్థిపంజరములుగానున్న వేలకొలది ప్రజలకు మాంసకండలను చేకూర్చుచున్నది.

ఈ బలవర్ధకౌషధముయొక్క గుణములు — ఆరోగ్యము, శక్తిని తిరిగి చేకూర్చును. బరువు తగ్గుదలను, అలసటను వీర్యక్షీణమును పోరాడి నిరోధించును మరియు మితి మీరిన సంభోగ కార్యము వలన సాధారణముగా గల్గు పరిణామములకు 'జీవన్‌టోన్' ఒక మహత్తరమైన టానిక్. దీనిని ఉపయోగించిన కొద్ది రోజులకే దీని మంచి గుణములు తెలియును కావలసిన బరువు, ఆకార సౌష్ఠవము పొందిన తరువాత దీనిని ఉపయోగించుట నిలుపవచ్చును స్థూలశరీరులగు స్త్రీ పురుషులు మాత్రము దీనిని ఉపయోగించరాదు. ఏలనన అదివరకే స్థూలమైన శరీరములకు మరింత కండ, మాంసము పెరిగినయెడల నిత్య వ్యవహార జీవితములకే చాల అడ్డంకులు యేర్పడును స్త్రీలు ప్రసవించిన తరువాత దీనిని వాడవచ్చును. ఏ ఋతువునందైనను, ఏ కాలమందైనను నిర్ణీతమైన ఆహార నియమము లేకుండగనే ఈ మందును వాడవచ్చును.

వాడు విధము — చమిచాడు టానిక్కు ప్రతిరోజూ ఆహారమునకు ముందు మూడు మారులు. పాలు, పెరుగు, వెన్న వాడకపోయిననూ మంచి గుణము నిచ్చును వీటిని కూడా వాడినచో గుణము రెండింతలు ఎక్కువగును ఏ జబ్బును లేనివారు దీనిని ఉపయోగించినచో రక్తము మరింత వృద్ధియగును.

**తప్పనిసరిగా పెద్దలకుమాత్రమే -**
**సెల్ఫో ఆయిల్ వెల రూ 10-00**
**సెల్ఫో పౌడర్ . వెల రూ. 10-00**

వివరముల పట్టిక పంపగోరువారు పోస్టేజి బిళ్ళలు పంపండి.
వి. పి. పి. లో పంపగోరువారు క్రింది చిరునామాకు వ్రాయండి :

**JEEVANTONE PRODUCTS,**
**51, G. Street, Bangalore-8**

మాయొక్క స్టాకిస్టుదారులు — (1) జనతా మెడికల్ స్టోర్స్, శివాజీ నగర్ బస్సుస్టాండు ఎదుట, బెంగుళూరు; (2) సిటీ మెడికల్ చిక్‌పేట, బెంగుళూరు (3) 51— వెస్ట్రీట్, అల్‌సూరు, బెంగుళూరు—8, (4)జయంతి జనరల్ స్టోర్స్, దాదర్ స్టేషన్ ఎదుట, బొంబాయి—28. (5) ముంబాయ్ మెడికల్‌హాలు, జకరియా మజీద్ స్ట్రీట్, బొంబాయి—9. (6) శారదా ఎంటర్‌ప్రైజెస్, 1—727 టెంపుల్‌రోడ్, మంగుళూరు—6 (7) కె యస్ రావు అండ్ సన్స్ నెల్లూరు (8) సూరయ్య మెడికల్ స్టోర్సు, 1— పార్కురోడ్డు విజయవాడ—1. (9) లక్ష్మీనారాయణ అండ్ కో, కాకినాడ—1 (10) పి జి మోహన్‌కుమార్, ప్రహ్లాద్ బిల్డింగ్, పాదర్ బజార్, అహమ్మదాబాద్. (11) ఆయుర్వేదమ్ మెడికల్ హౌస్, కోటి బస్ స్టాండు, హైదరాబాదు—1, (12) శ్రీ ధనలక్ష్మి మెడికల్ స్టోర్సు విజయవాడ—3, (13) రాజేంద్ర మెడికల్ స్టోర్సు, గాంధి చౌక్, జమిగుంట, (14) శారదా స్టోర్సు 3106 రాష్ట్రపతిరోడ్, సికిందరాబాదు, (15) గుప్త మెడికల్ స్టోర్సు, లాలాపేట పోలీస్ స్టేషన్, గుంటూరు—3, (16) వసంత మెడికల్ స్టోర్సు, 4—4—293 కోటి, బ్యాంక్ రోడ్, హైదరాబాదు, (17) ఆయుర్వేదిక్ మెడికల్ స్టోర్సు, మెయిన్ రోడ్డు, అనకాపల్లి, (18) ఎం. ఎ. జనరల్ ఏజెన్సీస్, 8 7 తెరడ్‌స్ట్రీట్ కోయంబత్తూరు—10, (19) మహాలక్ష్మి స్టోర్సు, సాగర్, షిమోగా (20) 18—పూనమల్లి హైరోడ్ (కమల కాఫీ వర్క్సు) మద్రాసు—3




## మనశ్శుద్ధి - గజస్నానం

మావటివాడు ఏనుగు శరీర మాలిన్యాన్ని పోగొట్టి పరిశుభ్రం చెయ్యడానికి తటాకానికిగాని, ఏటికిగాని తీసుకునిపోయి ఎంతో శ్రమపడి దాని శరీరాన్ని తోమి కడిగి, పరిశుభ్రంగా చేస్తాడు ఇంత కష్టపడి, పరిశుభ్రం చేశాక ఆ మహా జంతువును తన యిచ్ఛ వచ్చినట్లు తిరగడానికి విడిచివేస్తే, అది శీఘ్రంగానే మళ్లీ ఒడలినిండా మట్టి పోసుకుని మలిన శరీరంతో అసహ్యంగా తయారవుతుంది అలా కాకుండా — దాన్ని స్నానం చేయించినతర్వాత స్వేచ్ఛా విహారానికి విడిచిపెట్టకుండా కట్టుకంబానికి తీసుకుని వచ్చి బంధించినట్లయితే పరిశుభ్రంగానే ఉంటుంది, అలా కట్టుదిట్టం చెయ్యని యేనుగు స్నానంచేసినా, ఆ స్నానం నిష్ప్రయోజనమని "గజస్నానం హి నిష్ఫలం" అనే పెద్దలసూక్తి తెలియజేస్తూనే ఉన్నది

బ్రహ్మనుగురించి తెలుసుకునే సంసారి పద్ధతికూడా యిటువంటిదే!

సంసారంలో కొట్టుమిట్టాడుతున్న వ్యక్తికి తన ఉద్యోగంలోనూ, గృహకృత్యాలతోనూ సరిపోతూ ఉంటుంది అతనికి పారమార్థిక చింతకు అవకాశమే వుండదు అవకాశం కలుగజేసుకునేవారి సంఖ్య చాలా తక్కువ అట్టివారు ఉత్తముల సాహచర్యం వల్లా, పరతత్వాన్ని బాగుగా బోధించేవారు అదృష్టవశాత్తూ లభించడంవల్లా మనస్సును పరిశుద్ధం చేసుకుని, ఆ పరబ్రహ్మ తత్వాన్ని గ్రహించవచ్చు గ్రహించి, ఆత్మానుభవానికి సాధన చెయ్యవచ్చును దానికి మనోనైర్మల్యం ప్రధానం అట్టివారు మామూలుగా సామాన్య జనులతో కలిసి మెలిసి తిరుగుతూ ఉంటే యథాపూర్వంగానే తయారవుతారు మనస్సులో తిరిగి మాలిన్యం చోటు చేసుకుంటుంది పదిమందితో కలిసి మెలిసి తిరగటంవల్ల వారి అలవాట్లూ, ఆలోచనలూ తప్పించుకోవడం సాధ్యం కాకుండా పోతుంది స్నానం చేసిన ఏనుగు తిరిగి ఒడలికి బురద పూసుకున్నట్లే వుంటుంది వారి ప్రవృత్తి మనస్సు నిర్మలంగా ఉండి పరతత్వ గమనానికి అభిముఖంగా ఉండినప్పుడు, ఆ మనస్సును ఆ విధంగానే ఉంచుకోడానికి ప్రయత్నించాలి ఏనుగును కట్టుకంబానికి కట్టినట్లు మనస్సు సంసార సంబంధం వుండే విషయాలకు లోనుకాకుండా ఉండేటట్లు చూడాలి

సత్పురుషుల ప్రభావంవల్ల పరిశుద్ధతను సంపాదించినవారు మరల అపరిశుద్ధులతో కలిసిమెలిసి ఉండకూడదు

కలిసిమెలిసివుంటే వారిదివరలో చేసిన సాధన అంతా నిష్ప్రయోజనమైపోతుంది అది గజస్నానంలా తయారవుతుంది

# ఫాలాక్షుని డైరీ

## పదేళ్లకి మళ్లీ ఉద్యోగం !

ఆఫీసు టైములో ఎన్నడూ తన కుర్చీలో కనపడ్డనీ, శలవు పెట్టిన రోజుల్లో ఆఫీసుబీరువాల తాళాలు కూడా యింటికి తీసుకుపోతాడనీ, అతని సీటులో పని ఎప్పుడూ బకాయి వుంటూనే వుంటుందనీ విచారించి పాండిచ్చేరి మునిసపాలిటీలో ఎక్కవుంట్సు క్లార్కుగా పనిచేస్తున్న ఆర్ క్రిష్ణన్ అనే అతన్ని మేయర్ 1965 మే ముప్పయ్యో తేదీన పనిలోంచి తొలగించారట ఈ విషయాన్ని మద్రాసు హైకోర్టు విచారించి మేయరుక అటువంటి అధికారం లేదని, కనుక కృష్ణన్ను తిరిగి పనిలో తీసుకోవాలని తీర్పు నిచ్చిందట "దేళ్ల తర్వాత కృష్ణన్ మళ్ళీ అదే వుద్యోగంలో చేరేడట

## నిజమా ?

పోలెండ్‌లో మన దేశపు సరుకులు, వస్తువులు విరివిగా అమ్ముడు పోతున్నాయట ఏ వస్తువయినా సరే, హిందూదేశం నుంచి వచ్చిందనీ అనడంతోనే ఎంత వెలైనా యిచ్చి కొనుక్కు పోతున్నారట మన దేశం బట్టలు, రెడిమేడ్ దుస్తులు, ఎంబ్రాయిడరీ చేసిన జాకెట్లు పిచ్చిగా కొనేస్తున్నారటక్కడ నెక్లేసులు చెవుల ఆభరణాలు వగైరాలు విపరీతంగా అమ్ముడు పోతున్నాయ్యట తమ తమ యిళ్లలో మనహిందూ దేశపు తయారీ వస్తువులు పెట్టుకోడం అక్కడి గృహిణులలో ఫ్యాషనుగా, గర్వంగాచేసుకున్నారట—పిటీ దెవ్మార్రెప్రిషియేట్టేవ్ ! ఏ జ్యూలైకిట్

## విధి రాకాసి

బీహారుకు చెందిన ఎర్దాలాలో వివాహం చేసుకోబోతున్న వో పెళ్ళికొడుకు తమ్ముడు వడగాలికి మెలికలు తిరిగిపోయి, వైద్య సహాయం అందేలోగా చనిపోయాడట దాంతో ఆ పెళ్ళివందిరి స్మశానంగా, శోకమయంగా మారిపోయిందట ఇది మే ఎనిమిదో తేదీన జరిగింది నవాడా (బీహారు) జిల్లాలో గత వారంలో ఎండదెబ్బకు సుమారు పదకొండు మంది చనిపోయారట

## మళ్లీ పాతపేరు !

జాక్విలిన్ కెనెడీ (కీ శే కెనెడీ భార్య) ఒనాసిస్ అనే అతన్ని వివాహం చేసుకుని, ఆ ఒనాసిస్‌తో తన పేరు కలుపుకుని, జాక్విలిన్ ఒనాసిస్‌గా మార్చుకుని, యిప్పుడా ఒనాసిస్ చనిపోడముతో మళ్లీ తన పేరుకు కెనెడీ నామం తగిలించుకోవాలనుకున్నదన్న తన కోరిక బయటపెట్టిందట అమెరికా చరిత్రలో కెనడీ భార్యగా తన స్థానం మరచిపోరానిదని, అందుకే తను చట్టబద్ధంగా మళ్లీ తనాపేరుకు తన పేరుకు చేర్చుకోదల్చుకొంటున్నట్టు ఆమె అన్నదట — ఉమెన్ ఆర్ సో ఇన్స్పిరియర్టుమెన్

రచయితలు తమ రచనలతోపాటు హామీ పత్రం జతచేసి పంపాలని మనవి —సం.

### రూపాయికి పైసలెన్ని?

ఈ నాడు రూపాయల విలువ విపరీతంగా పడిపోయిందనీ, గత ఫిబ్రవరికి రూపాయ విలువ 25 3 పైసలేనని ఒప్పుకుంటూ, "అభివృద్ధిలోకి వస్తున్నచాలా దేశాలకన్నా మనం మెరుగు అని ఆనందించాలి" అని కేంద్ర ఆర్థిక మంత్రి మిస్టర్ సుబ్రహ్మణ్యం అన్నారట మనింట్లో తిండి లేకపోయినా పక్కింట్లో కాఫీ కూడా లేదని ఆనందించాలి వారికన్నా మనమే మెరుగే అని తృప్తిగా పొట్ట తడుముకోవాలి మైన్డట్!

### బ్రిటన్‌లో నిరుద్యోగం

బ్రిటనులో నిరుద్యోగ సమస్య తలనొప్పి స్థితి కూడా దాటి పోయిందట పోయిన సంవత్సరం నవంబరు నుంచి యీ సంవత్సరం ఏప్రియల్ వరకూ నెలకు 29,400 మంది సుమారుగా నిరుద్యోగుల జాబితాలో చేరారట మొన్నఏప్రియల్ నెలాఖరుకు 7,59,800 మంది నిరుద్యోగులు నమోదయ్యారట ●

కంగారు ఎక్కువ కాసాగింది మనస్సులోని శక్తి ఎవ్వగిలపాగింది

ఉన్నట్టుండి పోర్టికోలో కారు స్టార్టయిన శబ్దం వినిపించి ఉలిక్కిపడింది అరవింద చటుక్కున బయటకు పరిగెత్తింది ఆమె వీధి గుమ్మంలో కడుగుపెట్టేసరికి కారు మెయిన్‌గేటు దాటి వెళ్ళిపోయింది డ్రయివ్ చేస్తున్నది ఎవరోకాదు కాళింది!

అయోమయంగా వెనక్కి తిరిగింది అరవింద పనిమనిషి బయటకు వస్తూ "అమ్మగారేదో అరిజెంటు పనిమీద వెళ్ళారమ్మా!" అంది

నిస్పత్తువగా "చెప్పకుండానే వెళ్ళిపోయారా?" అంది ప్రక్కకి చూసేసరికి ప్రభాకర్ నిలబడి ఉన్నాడు కళ్ళు చీకట్లు క్రమ్మినంత పనయింది ఆమెకు

'అమ్మగారీ కవరు మీ కివ్వమన్నారమ్మా!'' అంది పనిమనిషి

ఆశ్చర్యంగా దాన్ని అందుకుంది అరవింద ఆమెను పొదివి పట్టుకున్నాడు ప్రభాకర్ అరవింద వణికే చేతులతో కవరు తెరిచి కాగితం బయటకు తీసింది గజిబిజిగా వున్న ఆ అక్షరాలలో కాళింది మనస్సుని చదవసాగింది

'అరవిందా!

ఆనాడు పిలవని పేరంటంగా మీ ఇంటికి వస్తే ఉన్న ఒక్క కుర్చీ నాకిచ్చి నేనువిన్న సూటీపోటీ మాటలన్నా ఎక్బలంగా నీ వంటింటి గదిలోనే కూర్చుండిపోయావు నే నింటికి పిలిచి పది కుర్చీలున్నా కూర్చోమని మాట వరసకయినా అనలేదు నువ్వెప్పుడూ కుర్చీ వైపన్నా చూడలేదు ఈ వేళయినా కు

# మంచిని పెంచి చూడు

(8వ పేజీ తరువాయి)

రుంపాక కూర్చుంటావేమో ననుకున్నాను కాని, నేను నొచ్చుకుంటానని నీ భర్తని కూర్చోమన్నావు కాని— నువ్వు మాత్రం అలాగే నిలబడ్డావు ఆ మాట విన్నాక—విన్నా స్థితిలో మాశాక నా కింక నీ ముందుకి రాగల ధైర్యం లేకపోయింది నీలాంటి క్రమశిక్షణ కలవాళ్ళముందు నాలాంటి చపల మనస్కులు ఎప్పటికీ నిలబడలేరు!

కాగితం పూలు కలకాలం ఉండచ్చు అసహ్యంగా అందరికీ చిరాకనిపించేలా తయారవుతాయి జీవంలేని ఆ పూలకి ఆకర్షణ ఎక్కడుంది? మరి గడ్డిపూలు క్షణికాలే అయినా సజీవంగా కమ్మని మట్టివాసనలు వెదజల్లుతూ అందర్నీ ఆకర్షిస్తాయి వాటికి పెద, గొప్ప వివక్షతలేదు ఆ నిజం—నన్ను చూశాకనే నాకు తెలిసింది అరవిందా!

ఇకనయినా కుర్చీలో కూర్చొని ఈ నాల్గు ముక్కలూ చదువు అరవిందా!

అంతవరకు చదివి ప్రభాకర్ వైపు చూసింది ఆమె అతనామెను నడిపించి డ్రాయింగ్ రూమ్‌లోకి తీసుకువెళ్ళాడు

పడ్డించిన విస్తరివంటి నా జీవితంలో విశృంఖలతే కాని విచక్షణ అన్నది మృగ్యం అయిపోయింది పెద్దవాళ్ళు ఆడంబరాలతో ప్రతకటం నేర్పారుకాని—అంత కరణ ఎలా పెంపొందించుకోవాలో మచ్చుకయినా చెప్పారుకాదు అందుకనే ప్రభాకర్‌వంటి అమృత హృదయుణ్ణికూడ నా అహంకారంతో గుప్పిట్లో పెట్టుకోవాలనుకున్నాను అందుకనే అతడు నన్ను చీదరించుకు వెళ్ళిపోయాడు అతడే నా జీవితంలో ప్రవేశించి వుంటే నే నింతకాలం ఇలా మూర్ఖంగా వుండేదాన్నికాదు! ఎప్పుడో నీ స్థానం ఆక్రమించుకొని వుండేదాన్ని ప్చ్! నాకా అదృష్టం లేకపోయింది!

స్థిరజీవితమంటూ లేక విచ్చలవిడిగా సంచరిస్తున్న నాకు హఠాత్తుగా తారసపడ్డాడు ప్రభా నాకు లేని సుఖసంతోషాలు ఏ ఆడదీ అనుభవించకూడదన్న మూర్ఖత్వంతో మీ యింటికి వచ్చాను అక్కడేం జర్గిందీ నీకు తెలుసు

ఎలాగయినా అతనికి పరాభవం చేయాలని నా కాళ్ళమీద పడేలా చేసుకోవాలని అంత పని చేశాను విజిలెన్సు ఆఫీసరు, డి ఎస్ పి వీళ్ళంతా క్లబ్బులో మెంబర్లు నేనంటే వ్యామోహం కాబట్టి ప్రభాకర్‌ని జైల్లో పెట్టించటం, విడిపించటం నా యిష్ట ప్రకారం జరిగాయి ఈ క్షణంవరకు డబ్బుతోటి, దర్పంతోటి ఏ పనేనా చేయగలనను కునేదాన్ని—చాలవరకు అలాగే చేసుకుంటూ వచ్చాను

కాని, డబ్బు చేయలేని పనులు కొన్ని ఉన్నాయని ఇప్పుడిప్పుడే తెల్సివచ్చింది

అరవిందా! నీ మాటలు—ఒకసారి మననం చేసుకుంటే నా కిప్పుడిప్పుడే నిజం తెలుస్తోంది—నేనెన్నో సంగతులు దాచగలిగాననుకున్నాను కాని, నువ్వన్నీ నా మాటల్ని బట్టి గ్రహించావు ప్రభాకర్ జైల్లో పడటానికి కారణం నేనేనని నీకు తెలుసు అయినా నువ్వు నా దగ్గఱకే వచ్చావు నా మాటల్లోని కటుత్వానికి చలించకుండా—గోవు కసాయివాణ్ణి నమ్మినట్లు—నువ్వు నన్నే ఆశ్రయించావు నా షరతు లన్నిటికీ అంగీకరించావు

ప్రభాకర్ పరాభవింపబడాలని కసి అత డవమానంతో క్రుంగిపోతుంటే హాయిగా నవ్వుకోవాలని కసి ఆమాటే అతని ముఖాన్నవాలని కసి నాకు దక్కని సుఖ మింకెవరికీ దక్కకూడదనే అహం ఈ వలయంలో ఉడికిపోయాను మీ సుఖాన్ని కబళించాలని ఎంత చేశాను

బహుశ, అదికూడ నువ్వు గ్రహించావు అందుకనే, అంత ధైర్యంగా నీ భర్తను తీసుకొని నా దగ్గఱకి వచ్చావు పగను పగతోటే చల్లార్చటం నీ తత్వం కాదు



అందుకనే — నీ జీవితాన్ని చక్కదిద్దుకో గలిగావు—నాలోని అహంకారాన్ని అణచివేయ గలిగావు

"కాళ్ళమీద పడవేసుకొని ఏం చేసు కుంటావు—నాలా హృదయంలోకి తెచ్చుకో!" అని చెపుతూ నాయింట అడుగు పెట్టావు

మంచితనంతో ఒక మనిషిని గెలవటం నాలాంటి మంద బుద్ధులకి చేతకాదు అందుకనే ఇలా ఓడిపోయాను. ప్రభాకర్‌కి ఈ ముఖాన్ని చూపించలేక పిరికిదానిలా పారిపోతున్నాను నన్నొక్కసారి క్షమించమని ప్రభాకి చెప్పు అరవిందా!

ఎల్లప్పుడు నీ క్షేమాన్ని కోరే —

— కాళింది

(అయిపోయింది)

పె వారం వరకు నేను కుతూహలంతో ఎదురు చూ ంటా చక్కని ం ంతివృత్తాన్ని ఎన్నుకుని సీరియలును వ్రాసిన అన్నపూర్ణగారికి నా ధన్య వాదాలు

జవ్విల నాగేశ్వరరావు, హైదరాబాద్—37

## ఉత్తరాలు

(5వ పేజీ తరువాయి)

### ముఖచిత్రం

అత ముఖచిత్రంతో వెలువడిన 23—5—75 సంచిక ఏమాత్రం బాగాలేదు ఉత్తరాల శీర్షికలో 'వనవర్తి' పాఠకుడు కె రా గారి జవాబులు అందరకు నచ్చుతుందనిరాశాడు అది అతని తప్పా? లేక మీ ప్రింటు తప్పా? విమర్శలకు కూడా ప్రాధాన్యత ఇవ్వాలని కోరుతున్నాం

పత్తి శివప్రసాద్, పత్తి రవిప్రసా
ఎన్ టి ఆర్ అభిమాన సంఘం, నిర్మల్

### హైదరాబాద్ నోట్‌బుక్

23—5—75 సంచికలో తెలుగు విభాగంలో పూర్వ ఆచార్యుల చిత్రపటాలవల్ల ప్రతిభఅవగతమై ప్రస్తుత ఆచార్యుల పట్ల గౌరవ భావం ఏర్పడుతుందని రాశారు ఇదే గనక నిజమైతే అన్ని విభాగాల్లో చిత్రపటాలు పెడితే సరిపోతుందిగా ? ఇక విశ్వ విద్యాలయాల్లో క్రమశిక్షణా రాహిత్యం ఉండదు కదా! మడి ఎట్టలు కడితే దొంగలు కొబ్బరి కాయలు ఎత్తుకు పోరు అన్నట్టుగా ఉంది రామచంద్రగారి వ్యాఖ్యానం దేశంలో ఉన్న చిత్ర పటాలు, శిలా విగ్రహాల వల్ల ఫలితం ఏమిటంటే వాళ్ల "ఇగో"ను సంతృప్తి పరచుకోవటం తప్ప ఇంకేం లాభం లేదు

కె రామారావు, హైదరాబాద్—27

### ధర్మపథము

ఈ మధ్య మీ వారపత్రికలో కాస్త ప్రేమా యణము పెరిగినట్లు అనిపించుచున్నది దీనినికాస్త తగ్గించి విజ్ఞానదాయకములు కథలు ప్రచురించ గలరు మీ పత్రిక తక్కువ ఖరీదుకు, ఎక్కువ ఆనందము సమకూర్చుచున్నది దానిలోని "ధర్మ పథము" బులుసు వెంకటరమణయ్యగారిది చాలా విజ్ఞానదాయకములుగ ఉంటున్నాయి సామాన్యుని సణుగుడు, రెండు పేజీలోని కార్టూనులు చాలా వింతను కొలుపుతున్నాయి

వెం. స. ప్ర చెరువు, నాగపూరు

## అవీ - ఇవీ - అన్నీ

### తెలుగు బాలలు—వెలుగు జల్లులు

రాజారాం పబ్లికేషన్స్ వారు బాలల కోసం ప్రచురించిన ఈ చిన్న పుస్తకం మా కార్యాలయం చేరింది 28 పేజీలు, వెల 40 పైసలు ప్రతులకు, రాజారాం పబ్లికేషన్స్, 2౩, స్టేట్ బ్యాంక్ ఆఫీసర్ కాలనీ, విజయవాడ—10

### ఓల్గా తరంగాలు!

ప్రముఖ రచయిత 'శ్రీకాంత్' రాసిన "వోల తరంగాలు" అన్న 105 పుటల గ్రంథంలో సోవియట్ సాహితీ సమాలోచనలు జరిగింది
ప్రచురణకర్తలు శిరీష్ ప్రచురణలు
15, అరుణాంబాల్ స్ట్రీట్, మదరాసు—17,
వెల 3 రూపాయలు






**Printed and Published by S NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada 3 Editor S Radhakrishna**

# గ్రోమోర్ యూరియా అమోనియం ఫాస్ఫేట్ 28-28-0

## మీరు పండించే ప్రతి పైరుకు వేయదగిన మంచి రసాయనిక ఎరువు. ఎందుచేత?

## అన్ని పైరులకు అవసరమైన ముఖ్య పోషక పదార్థాలు నత్రజని, భాస్వరామ్లములు సమ పాళ్లలో అత్యధికంగా వున్నందు మూలాన!



గ్రోమోర్ యూరియా అమోనియం ఫాస్ఫేట్ 28 28 0లో నత్రజని భాస్వరామ్లము ఎక్కువగా వున్నాయి అంటే 100 కిలోల ఎరువులో మొత్తం 56 కిలోల పోషక పదార్థాలున్నాయి అందుచేత ఎకరా భూమిలో వేయవలసిన గ్రోమోర్ ఎరువుల మోతాదు మామూలు ఎరువులకంటే తక్కువ

గ్రోమోర్ 28 28 0 వరి గోధుమ చెఱకు నూనె గింజలు చిరు ధాన్యాలు మిరప, కూరగాయలు మరియు అన్ని పైరులకు వేయుటకు అనువైన పోషక పదార్థాలు ఎక్కువ నిష్పత్తిలో లభింపజేయు కాంప్లెక్సు ఎరువు ఇంతెందుకు — గ్రోమోర్ 28 28 0 వేసి ప్రతి పైరు నుంచి ఎక్కువ పంట దిగుబడి పొందవచ్చు

దీనిలోని నత్రజని అమోనియా రూపంలో లభిస్తుంది కాబట్టి పైరుకు కావలసిన నత్రజని వృథాపోకుండా పైరు తీసుకుంటుంది భాస్వరామ్లం నీటిలో కరుగుట వలన తొందరగా తేలికగా మొక్కలు గ్రహించ గలవు ఈ విధంగా ముఖ్యమైన రెండు పోషక పదార్థాలు వృథాకాకుండా సకాలంలో లభించడంతో మీ పైరు ధృఢమైన వ్రేళ్లతో ఏపుగా పెరుగుతుంది

గ్రోమోర్ యూరియా అమోనియం ఫాస్ఫేట్ 28 28 0 చిన్న చిన్న గుళ్లగా వుంటుంది అందుచేత పొలం అంతటా సమానంగా చల్లి మంచి ఫలితం పొందవచ్చు









వ్యవసాయ విషయములలో ఉచిత సలహాలకు, మట్టి పరీక్ష వివరాలకు ఈ క్రింది చిరునామాకు వ్రాసి తెలుసుకోండి

కోరమాండల్ ఫెర్టిలైజర్స్ లిమిటెడ్
126, [illegible] రోడ్, సికింద్రాబాద్-500 003



Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA

